## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

విమలానందభారతీ గ్రంథమాల - సప్తమ పుష్పము
విమలానంద భారతీ మాసపత్రికనుండి ఉద్ధృతము

# ఉపదేశామృత తరంగిణి

సంగ్రథనము
పోలూరి హనుమజ్జానకీరామశర్మ, B. A (Hons)
ప్రాచ్యభాషా విభాగాధ్యక్షుడు
శ్రీ వేంకటగిరి రాజ కళాశాల
నెల్లూరు.

ప్రథమ ముద్రణము - 250 ప్రతులు.

ంగళ - చైత్రము
977 ఏప్రిల్

వెల
రు. 2-00

విషయసూచిక

# — * తొలినుడి * —

కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీపీఠం ప్రథమ పీఠాధిపతులు శ్రీశ్రీ విమలానంద భారతీ స్వాములవారు (పూర్వాశ్రమంలో శ్రీ కానుకొల్లు త్రివిక్రమ రామారావు పంతులుగారు) బందరులో దివ్యజ్ఞాన సమాజ మందిరములో మన సంస్కృతిని గురించి అమూల్యములైన ఉపన్యాసము లిచ్చిరి. వానిని ప్రస్తుత పీఠాధిపతులు శ్రీశ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామివారు (పూర్వాశ్రమంలో శ్రీ చిట్టూరి రామకృష్ణారావు పంతులుగారు) వ్రాయ ప్రయత్నించిరి. చెప్పినవన్నీ వ్రాయుట సులభము కాదు. సంక్షిప్త లేఖనము, టేపు రికార్డింగులద్వారా కాదు. అందువలన సంగతి, సందర్భములు సరిగా కుదురలేదు. 'ఉపదేశామృత బిందువులు' అను శీర్షిక క్రింద 'విమలానంద భారతి' లో అవే ఉన్నవున్నట్లు కొన్ని ప్రచురింపబడినవి. సంగతి సందర్భములతో వానిని సమగ్ర వ్యాసములుగా తిరిగి కూర్చి ప్రచురించుట మంచిదని మిత్రులు సూచించిరి. వీనినట్లు కూర్చు భారము శ్రీ పోలూరి హనుమజ్జానకీశర్మ గారు వహించి దానిని ప్రశంసనీయముగనే ముగించి యిచ్చిరి. ప్రస్తుత పీఠాధిపతులు వానిని వ్రాయుట, వాని నాధారముగా వీరిట్లు కూర్చుట రెండును మహత్కార్యములే. వారికి కృతజ్ఞత తెల్పుచున్నాము. ఇవి అసదృశములైన ఉపదేశములు. ఇది నిజముగా అమృత తరంగిణి. ఇవి దాదాపు 180 పుటలు కావచ్చును. అంతవరకు ఆగిన చాలకాలము పట్టునని ముందు కొంత, ప్రథమ భాగముగా వెలువరించు చున్నాము.

ప్రతి దానికి ధనము కావలెను. దీనికి అడుగకయే సహాయము చేసిన నా పూర్వవిద్యార్థి చిరంజీవి గుండా శంకరలింగము B. A., C. A. I. I. B మంచిరియాల హైదరాబాదు స్టేట్ బ్యాంకు మేనేజరును అభినందింపవలసి యున్నది.

అతని తండ్రి గుండా ముక్తి లింగంగారు నాకు వరంగలులో మిత్రులు. ముక్తి లింగంగారి తండ్రి బుచ్చయ్యగారు తల్లి రాజమ్మ గారు. భార్య జయలక్ష్మమ్మగారు. ముక్తి లింగంగారు బాల్యము నుండియే కవియై, సాహిత్య పరిశ్రమ చేసినవారు. గ్రంథాలయోద్యమములో ఎక్కువ సేవచేసి అక్కడ శబ్దానుశాసన గ్రంథాలయస్థాపనకు తోడ్పడి చిరకాలము దానికి కార్యదర్శిగా నుండి దాని నభివృద్ధికి తెచ్చినారు. వారు తెనుగులో గద్య పద్య కావ్యములు నాటకములు రచించి బాల కవియని పేరొందినారు. వేములవాడలోని రాజరాజేశ్వర స్వామివారి యిలువేలుపు. వారిమీద వీరు 'రాజ రాజేశ్వర శతకము' ని యొక చక్కని ధారాశుద్ధి కల్గిన గ్రంథమును వ్రాసి ప్రచురించినారు అప్పట్లో ప్రతి సాహిత్య సభలోను పాల్గొను చుండెడివారు. తండ్రి మరణానంతరము వీరు జ్యేష్ఠులగుట, కుటుంబ భారము వహించి, వ్యాపారములోనికి దిగవలసివచ్చుటచేత సాహిత్య వ్యాసంగము వెనుకబడినది. ఆయన పెద్ద కుమారుడు గుండా మనోహరరావు, M. A., B. Ed , L. L. B. అతని భార్య చి॥ ల॥ సౌ॥ కనకలక్ష్మమ్మ. ముక్తి లింగంగారు కొంత కాలమునుండి పనినుండి విరమించి భార్యతో, కుమారుల దగ్గర ఉండి శాంతి సుఖము ననుభవించు చున్నారు. తల్లి దండ్రులను భక్తితో సేవించు భాగ్యము కుమారులకు కల్గుట చాల అదృష్టము. పుణ్యము.

చిరంజీవి శంకరలింగము సహధర్మచారిణి చి॥ ల॥ సౌ॥ వరలక్ష్మమ్మ. వీరికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. మన సంస్కృతి ధర్మమునకు స్థానమిచ్చి ఇహపరములలో సుఖమునిచ్చు త్రోవ చూపినది అందులో తల్లి దండ్రులను ఎట్లు సేవింపవలెనో సోదర సోదరీ గణమును బంధువులను భార్యను ఎట్లాదరింపవలెనో, చూపినది పాశ్చాత్య సంస్కృతి వచ్చి దీనిని తారుమారు చేయు చున్నది. అందులోనున్న మంచికంటె మనవారు చెడునే గ్రహించు

చుండుట విచారకరము. చిరంజీవి శంకరలింగమునకు, అతని కుటుంబ మునకు, తల్లితండ్రులకు, సోదర సోదరీగణమునకు భగవంతుడు చిరాయు రారోగ్యైశ్వర్యములు, సుఖశాంతులు అనుగ్రహించుగాక. అతని పిల్లలు కూడ విద్యాబుద్ధులు, సౌశీల్యము కల్గి సర్వ పురుషార్థములను సాధింతురుగాక !

శాస్త్ర విరుద్ధములు ధర్మముగా పరిణమించిన యీ కలికాలము లో ధర్మ ప్రచారము కొరకు చేసిన దానమే సరియైన దానము. అదు గకిరయే యిచ్చుట ఇంకను ప్రశంసనీయము.

— కారుమంచి కొండలరావు.

ప్రాప్తిస్థానము :—

K. Kondala Rao,

Editor :- Vimalananda Bharati,
Bavajipet :: Vijayawada - 520 003.

మన సంస్కృతిని ప్రచారముచేయు 'విమలానంద భారతి' అను సాహిత్య మాస పత్రికను పోషించండి.

తిరుమల ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ-2

# తప్పొప్పుల పట్టిక

ఈ పుస్తకమునందు తప్పులు చాల పడినవి. శకటరేఫలు, అరసున్నలు, సంధులు దిద్దుటలేదు. ముఖ్యమైనవే క్రింద ఈయబడినవి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | ఫీఠాధి | పీఠాధి |
| 4 | 13 | సంసార | సంస్కార |
| 7 | 27 | వర | వర్గ |
| 9 | 1 | ప్రయుక్త్యో | ప్రయుక్తో |
| 10 | 25 | వాఁడు లింద్రియా | వాఁడ వింద్రియా |
| 11 | 10 | లేదకా | లేదర్భకా |
| 11 | 20 | రవ్విధంబు | అవ్విధంబు |
| 14 | 1 | తదాత్మ్య | తాదాత్మ్య |
| 14 | 13 | వాఁడును | వాఁడను |
| 18 | 1 | మన్యు | మనుష్యు |
| 18 | 19 | నుందు | నుండ |
| 20 | 13 | అవలకబి | అవలంబి |
| 33 | 23 | వర్ప్రింప | పర్వరింప |
| 37 | 15 | అభేదా | అఖేడా |
| 38 | 9 | ఐదవ | ఐదువ |
| 39 | 17 | భేరినా | భేదినా |
| 40 | 4 | దిమోక్ష | విమోక్ష |
| 40 | 18 | అర్ధింప | ఆర్జింప |
| 45 | 9 | వైరె | పైరె |
| 46 | 19 | వ్యత్పత్తి | వ్యుత్పత్తి |
| 46 | 24 | దా బట్టి | దానిని బట్టి |
| 51 | 2 | యోఽషం | యోఽహం |
| 54 | 16 | మరపిం | మరవిం |

పాఠకులు సులభముగా గ్రహింపగలవి వదలివేయబడినవి.

# ఉపదేశామృత తరంగిణి

## విద్యలు

[శ్రీ విమలానందభారతీ స్వాములవారు బందరులో థియోసాఫికల్ లాడ్జిలో వరుసగా ఇచ్చిన ఉపన్యాసములు ప్రస్తుత పీఠాధిపతులచే వ్రాయబడినవి 'ఉపదేశామృత బిందువులు' అను శీర్షికతో కొన్ని ప్రచురింపబడి, అవి Connected వ్యాసాలుగా వేస్తే మంచిదనుటవలన ఆపివేయబడినవి. వానిని వ్యాసములుగా శ్రీ పి. హెచ్. జానకీరామశర్మ M. A గారు కూర్చినారు. అవి ఈ సంచికనుండి ప్రారంభింపబడు చున్నవి. అసదృశమైన ఆ వ్యాసములను చదివి మాపాఠకులు కృతార్థులగుదురు గాక!

సంపాదకుడు.]

### 1. ఇప్పటి చదువు

మనలోపల మంచిచెడ్డలు రెండును ఉన్నవి. చెడును పైకి తీసికొని రాగూడదు. కలిగిన తలంపు నెల్ల చెప్పఁగూడదు; వ్రాయకూడదు. ఏ వస్తువులో ఎంత శక్తి యున్నదో తెలిసికొనవలయును. దుష్టమైనశక్తిని పైకి రానీయఁ గూడదు ఆ శక్తిని నాశనము చేయవలయును. లేనిచో అదియే సర్వనాశనము చేయును. కాఁబట్టి దానికి నివారణోపాయము తేవలయును దుష్టమైన దానిని శిక్షించి అణఁచి వేయవలయును. మనశాస్త్రము ప్రమాతను సంస్కరింపుమని చెప్పుచున్నది. ప్రమాత యనఁగా ప్రపంచమును జూచి గ్రహించుచున్న జీవుఁడు. ప్రమాతృత్వమును, అనఁగా జీవుని స్వభావమును, శిక్షించుటకు కర్మ ఏర్పడినవి. శిక్షించుట వేఱు, మనస్సులో నున్నదానినంతను పైకి లాగుట వేఱు. లోపల నున్న దంతయు పైకి లాగుటయే యిప్పటి చదువు "విద్య యొసఁగును వినయంబు" అని మనవారు చెప్పినారు. సూర్యుఁడు కాంతి నీయకపోయినచో సూర్యుఁడు కాదు. అట్లే విద్య వినయమును ఈయవలయును. వినయమును ఈయకపోయినచో అది విద్యకాదు. ఇంగ్లీషువిద్య అవిన

యమును ఇచ్చుచున్నది. అసలీయవినయము మనకు సహజ మగుట వలననే

శ్లో॥ అవినయ మపనయ విష్ణో!
దమయ మనః, శమయ విషయ మృగతృష్ణామ్।
భూతదయాం విస్తారయ
తారయ సంసార సాగరతః॥

అని షట్పదీస్తోత్రములో మొదటి శ్లోకములోనే యీ యవినయమును తీసివేయుమని ప్రతివాఁడు పరమేశ్వరుని ప్రార్థింపవలెనని శంకరుల వారుపదేశించినారు. ఉపనయనములో సగము భోజనము కాఁగానే వటువును తీసికొని వత్తురు. అనఁగా భోజనము మితిమీరి చేయఁగూడదన్నమాట. ఇట్లే ఆహారనిద్రాభయ మైథునములలో పడఁగూడదు. విద్య కిదియే ప్రయోజనము.

## ౩. కళలు – విద్యలు

ఏభావ ముద్భవిల్లినను ఆ భావమే మనమై పోవుదుము. నాకు కోపము వచ్చుచున్నది అని చెప్పుటకు ఆంగ్లమున ‘నేను కోపము అగుచున్నాను’ (I am angry) అనియే చెప్పుదుము. అట్లే దుఃఖము వచ్చినపుడు కూడ మనము దుఃఖమే యైపోవుదుము. అప్పు డాదుఃఖమును గూర్చి తనకు తాను చెప్పుకొనలేఁడు. అప్పుడు ఇతరులు ఓదార్చి దుఃఖము పోవునట్లుగా, మాటలు చెప్పవలెను. ఇందు కొఱకే విద్య లేర్పడినవి. అట్లే మనము జీవితములో అనుభవించుచున్న వాని నన్నింటిని లలితకళలు మనకు చూపించుచున్నవి. హరిశ్చంద్రునికథ హరిశ్చంద్రునకు యాదార్థమే (Real). హరిశ్చంద్రుని పాత్రను ధరించినవ్యక్తి కది నటన (Action) యగును. అద్దమునందువలె నిన్ను నీవు చూచుకొనుటకే కళలు ఏర్పడినవి. ఏవో పలువురి ప్రసంగములను గూర్చి వ్రాసినచో అది నాటకము కాదు. నాటకము చూచునప్పుడు మనకు ఈ జగమంతయు నాట

క్రమే యని తోఁచకలియును. మనము మన భావములను అద్దములో చూచినట్లుగా చూచుటకే కళలు ఏర్పడినవి. ఇంటియొద్ద మీరు ఏమిచేసి వచ్చినది, ఏమిమాటాడినది, మొదలుగాగల అన్ని విషయములు ఇప్పుడు మీరు ఊహింపఁగలరు. ఇప్పుడు ప్రస్తుతము (Presen-tly) ఎట్లు కూర్చున్నారో ఊహింపఁడు. ఊహింపలేరు. ఎక్కడ కూర్చుండి యున్నామను సంగతి కూడ తోఁచదు. వినుచున్న విషయమునందే మనస్సు లగ్నమై యున్నది. ఇదివరకే జరిగిపోయిన విషయమైన (Past Action) తరువాత చక్కఁగా ఊహింపఁ గలరు. ప్రతిస్థితిని, జరుగుచున్నదానిని (Present) నీవు ఎప్పుడు చూడఁగలవో అప్పుడే నిన్ను నీవు చూడఁగలుగుదువు. గడచిన దానిమీఁద మనకు వ్యామోహము, లేదా వ్యగ్రత, (Identification) లేదు గనుక దానిని చూడఁ గలుగు చున్నాము. ఇప్పటి స్థితిమీఁద వ్యామోహము ఉండుటవలన దానిని ఊహింప లేకున్నాము.

## ౪. రాగము

విద్యావంతులకు తపస్వులకు కూడ రాగ మెట్లు కలుగునో చూడుఁడు సప్త సారస్వత తీర్థమును వర్ణించునప్పుడు వైశంపాయనుఁడు జనమేజయునకు మంకణుని కథను చెప్పెను. (అరణ్యపర్వము ౩-౨౬౪, ౨౬౫). మంకణుఁడు మహాతపస్వి. అతని చేయి యొకప్పుడు కుశాగ్రముచేత చీరుకొని పోయినది. అటనుండి నెత్తురుకు బదులు శాకరసము వచ్చినది రక్తము లేదు గనుక నొప్పిలేదు. అంతటితో నతఁడు శరీరమును జయించినాఁడని యనుకొన్నాడు, పరమానందముతో మునిఁగి గంతులు వేయుట మొదలు పెట్టినాఁడు. స్థావర జంగమములన్నియు ఈ నృత్యముచేత బెదరిపోయినవి. అప్పటివారందరు ఈశ్వరుని యొద్దకు పోయి ఈ ఋషి నృత్యము చేయకుండ నాపుమని ప్రార్థించినారు. అప్పుడు మహాదేవుఁడు బ్రాహ్మణవేషముతో మంకణుని దగ్గరకు వచ్చి 'నీవు ధర్మజ్ఞుఁడవు, తపస్వివి; ఎందు కిట్లు నృత్యము చేయుచున్నావు' అని యడిగినాఁడు. ఇదిగో శాకరసమును చూడుము. ఇందుకు సంతోషించుచున్నాను అని అతఁడు

పలికెను. నిజముగా శోకరసము వచ్చినందులకు అంత ఆనందపడ వలసిన పని లేదు. అనఁగా అప్పుడతఁడు ధర్మతత్త్వ పరిజ్ఞానము కోల్పోయి రాగములో పడినాఁడన్నమాట. అప్పుడా మహాదేవుడు బ్రాహ్మణ వేషములోనే తన బొటన వ్రేలిని చేతితో కొట్టినాఁడు. అట్లు కొట్టఁగా బొటన వ్రేలి నుండి భస్మము రాలినది. అప్పుడు మంకణుఁడు సిగ్గుపడి ఆ బ్రాహ్మణుని కాళ్లమీఁద పడి "నీవు రుద్రుఁడవు. సర్వము నీవే. ఇట్లు నీ మాహాత్మ్యము చూచితిని. నా తపస్సునకు భంగము లేకుండ వరమీయవలసిన" దని కోరినాఁడు

## సంసారము

### 1. ప్రపంచము - పాశ్చాత్యుల దృష్టి

మనకు కనఁబడుచున్న ప్రపంచము నిజమా, నిజము కాదా! అసలు ఎట్లున్నది? – అని యనేకులు విచారణ చేయుచున్నారు. వారి వారి సంసారములను బట్టి విచారణ సాగుచుండును పాశ్చాత్యుల విచారణ భౌతికముగా సాగుచున్నది. అనగా, ఈ కనఁబడు వస్తువే అసలు కాదని చెప్పుచు భౌతికముగనే వస్తుస్వరూపములు పరిశీలించుచున్నారు. ఈ కనఁబడున దేమిటని ప్రశ్న. ఈ కనఁబడునది యిదే యని జవాబు. వస్తుస్వరూపమును భౌతికముగా తేల్చినచో, తేల్చినది ఏమీ లేదు కదా! మన చేతికి అంది సుఖ మిచ్చుచున్న ప్రపంచమును కాదని త్రోసివేయ వలయునన్నచో నెట్లు చెల్లును! చెల్లదు. మన వేదాంతము పొరపాటుగా చెప్పుచున్నదని కొందరందురు. పాశ్చాత్యులకు కనఁబడని ప్రపంచమును గుఱించి మన పెద్దలు బాగా చెప్పినారు.

వత్సమహర్షి కుమారుఁడు పంచకర్ణుఁడను మహర్షి తాను ఏడుగురు సూర్యులను చూచినట్లు చెప్పినాఁడు 'అపశ్య మహ మేతాన్ సప్తసూర్యా నితి... ...' (తైత్తిరీయారణ్యకము.) ఇట్లే కాశ్యప మహర్షి కూడ చెప్పినాఁడు.

ఈ సూర్యుఁడు దగ్గఱగా నున్నాఁడు. గనుక మనకు కనుపించు
చున్నాఁడు మిగిలిన సూర్యులు చాల దూరముగానున్నారు. ఆ మహ
ర్షులు చూచి మన కండ్లకు చెప్పుచున్నారు కశ్యపుఁడను మహర్షి
ఎనిమిదవ సూర్యుని చూచినాఁడు ఆ కశ్యపుఁడుండు స్థానము మహా
మేరువు (స్మృతిః ప్రత్యక్ష మైత్రిహ్యామ్) ఈ కనఁబడుచున్న
సూర్యుఁడు మనకు ప్రత్యక్షముగా కనఁబడుచున్నాఁడు గనుక
ప్రత్యక్ష ప్రమాణము, అనుమానము చేత, శిష్టాచారము చేత ఈ
సూర్యుఁడు గాక ఇంకను సూర్యులున్నారని తెలిసికొనవలసియున్నది
ఈ సూర్యుడు పుట్టక పూర్వము ఈ ప్రపంచ మే విధముగా నున్నది?
మహర్షులు మోక్షమార్గము చెప్పి ఈ సూర్యుని ఎట్లు ఉపాసింప
వలయునో చెప్పినారు. మొట్టమొదటనే యీ కనఁబడుచున్న ప్రపం
చమును త్రోసివేయవలయునని యుపదేశించినచో అది నిరర్థక
మగును. కావుననే శాస్త్రము మోక్షమును గోరువానికికూడ, "యథా
ర్థముగా ఈ ప్రపంచము లేదు; సూర్యుఁడు లేడు" అని చెప్పకుండ,
"ఈ విషయము నీ కిప్పుడు తెలియదు; ఈ కర్మకాండ చేయుము;
అప్పుడు బుద్ధి వికసించును యథార్థ మప్పుడు తెలియును." అని
చెప్పుచున్నది గాని యీ ప్రపంచమును వదలుమని చెప్పుటలేదు;
శాస్త్రీయమైన పరిశోధన Scientific Research) చేయవద్దని
చెప్పలేదు.

లోకములో అందఱు తమ కిష్టమైన వస్తువునే ప్రత్యక్షముగా
కోరుదురు. వస్తుతత్త్వ మెవ్వరికిని అక్కఱలేదు. శాస్త్ర దృష్టి లేని
వారికి ఈ ప్రపంచము విభాగాలుగానుండుట యిష్టము. అందులో
తమకు కావలసినదానిని వెతుకుకొనుచుందురు. మఱి యిట్టి లోక
మున కేమి చెప్పవలెను? "భేదములు లేవు; అంతయు ఒక్కటే;
ఆ యొక్కటిలో పుణ్యము పాపములు లేవు" అని చెప్పఁగూడదు;
మహాత్రక్షణాదులు లేవని చెప్పఁగూడదు. ఎందువలన? వినువానికి
వివేకము ( Discrimination ) లేదుగనుక. వానికి విరాగము వచ్చిన

దాఁక చెప్పఁగూడదు. ఇది వేదానుశాసనము. మన యనుభవము కూడ అంతే. మన యధికారమును మించి వెళ్లఁగూడదు; కాని (ప్రత్యేక పరిస్థితులలో Special Cases) వెళ్ళవచ్చును. ప్రతి వానికి చెప్పఁగూడదు. ప్రతివానివలన వినఁదలఁచఁగూడదు. ఎవరైన వాకిటిలోనికి వచ్చి, 'అమ్మా' మధుకరము పెట్టు'మని యడిగినపుడు, 'నీవు బ్రహ్మము; మధుకరమును బ్రహ్మమే' అని చెప్పినచో ఏమి సామరస్యముండును? అడిగినవాని యధికారమునుబట్టి చెప్పవలెను. అట్లు చెప్పుటవలన అందఱును తృప్తి నొందుదురు అందఱికిని తృప్తిగానున్నచో అసహనముండదు. అంతయు అస్థిరమే యన్నప్పుడు నిత్యమైన పదార్థమేదో తెలుసుకొనవలెగదా! ఇందులకై భక్తి కర్మయోగ జ్ఞానములలో ఎల్లరును వారి వారి రుచిని అనుసరించి తగినదానిని అవలంబించవలెను.

## 2. దుఃఖమును చూడఁగల్గుట

ప్రతిదానికి భూతభవిష్యద్వర్తమానము లున్నవి. దినమునకు ఆదిమధ్యాంతములున్నవి. ప్రతి దినము తినుట తిరుగుట నిద్రపోవుట మొదలగునవి జరిగిపోవుచున్నవి. వీని కన్నింటికి ఆదిమధ్యాంతము లున్నవి కాని మన జీవితమునకు యౌవనస్థితికి అంతమున్నదని యనుకొనలేము. విచారించలేము. ఎల్లప్పుడు యౌవనదశయందే యుండవలయునని కోరుచుందుము. ఇట్టి యౌవనము అంతమొందినను చూడము. కోరికలకు అనుగుణముగా ఇంద్రియములు పనిచేయని స్థితి వచ్చినప్పుడు యౌవనదశ పోయినదే యని విచారింతుము. మఱి మనయావత్తు ఉనికిని (Whole life) అంతమున్నది. కాని మన యునికి యొక్క అంత్యమును చూచుటకు మనకు ఇష్టముండదు శాస్త్రీయములైన కర్మలే మన యంత్యమును మనకు చూపగలవు. శాస్త్రీయములైన కర్మలనఁగా వేదములో చెప్పఁబడిన కర్మలే అని గ్రహింపవలయును. వైదిక కర్మానుష్ఠానము వలనఁగాక మన జీవితము యొక్క ప్రపంచము యొక్క ఆదిమధ్యాంతములను చూడలేము.

వర్తమానములో దుఃఖమును చూచుట చాల కష్టము. వర్తమానమునందు అభిమానము పోయినఁగాని దుఃఖమును చూడలేము. "వియోగమువలనఁ గలుగు దుఃఖమును స్మరించి, ప్రియజనమునందు స్నేహమును వీడుము" (స్మృత్వా వియోగజం దుఃఖం త్యజస్నేహం ప్రియేజనే) అని లక్ష్మణుఁడు రామునకు చెప్పినాఁడు. ఇంతమాత్రము మనకు తెలియదా అనవద్దు. మనకు అనుభవములో నున్నను వేనిని గుర్తించుటకు ఇష్టపడమో అట్టివానినే శాస్త్రము బోధించును. కొన్ని విషయములు మనకు తెలిసినవేయైనను జ్ఞాపకము చేసినప్పుడుగాని చక్కఁగా తెలియవు. మనజ్ఞానము, దాని వైఖరి బహు విచిత్రము. ఆత్మను చూడవలయునన్నచో స్నేహములను మానివేయవలయును. అవియున్నియు ఆత్మను తెలుసుకోవలెనన్నవానికి శత్రువులు. పూర్వము ఎంతో సుఖముగానున్న రామరాజ్యములోకూడ ఋషులు సంసారమును వదలి, అడవులలోనికిపోయి తపస్సు చేసికొన్నారు; అనఁగా స్నేహములను వదలుకొన్నారన్నమాట.

## 8. కాలపరిస్థితి-ప్రభుత్వ కర్తవ్యము

ఇట్టి ఋషులను రక్షించుట ప్రభువులకు ముఖ్యకర్తవ్యము. లేకున్నచో ధర్మము నిలువదు. ధర్మము నిలువనిచో లోకమ్మున సుఖముండదు. కావుననే రాముఁడు ఋషుల రక్షణకు పూనుకొనినాఁడు. 'ఎందుకు నీవు ఋషులను చంపినావు' అని రాముఁడు ఖరుని అడిగినాఁడు. వాఁడు సమాధానము చెప్పలేదు. అందువలన రాముడు వానిని చంపినాఁడు. దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుట పరిపాలకులకు అవశ్య కర్తవ్యము. ఇది జరుగనిచో అరాజక మేర్పడును. ఇప్పటి స్థితి మన గ్రంథములలో ఇంతకు ముందే అనేక విధముల వర్ణింపఁబడియున్నది. ధర్మరాజు భీష్ముని ఇట్లడిగినాఁడు. "ఏది ధర్మమో ఏది యధర్మమో తెలియక అధర్మమే ధర్మముగా చలామణి యగుచున్నప్పుడు, ఎవరియందును వర్ణధర్మములు ఆశ్రమ ధర్మములు కన్పించనప్పుడు, అన్ని మర్యాదలు అడుగంటి, వరములు లేక, పంటలు పండక, ఒకరి నొకరు మోసపుచ్చుచు ప్రజలు

దొంగలవలె బ్రతుకుచున్నప్పుడు, బ్రాహ్మణుడు ఎట్లు బ్రతుకవలె అప్పుడప్పుడు ఇట్టి పరిస్థితులు సంభవించుచునే యుండును. ప్రభువులు సరిగానున్నచో దేశములో క్షేమముండును రాజుయొక్క ప్రవర్తనను బట్టియే కృతాదియుగముల ధర్మములుకూడ ఏర్పడు చుండును. ప్రభుత్వము ధర్మమును రక్షింపనప్పుడు, మహాపత్కాలము తటస్థించినప్పుడు ధార్మికులైనవారు విజ్ఞా బలముచేత తమకు కావలసిన దానిని సాధించుకొనవలయునని పెద్దలు చెప్పియున్నారు. ఇట్టి సందర్భములోనిదే విశ్వామిత్ర చండాల సంవాద వృత్తాంత మని గ్రహింపవలసియున్నది మృత్యువు నెదిరించుటకు పూనుకొనినసే తప్ప, చావునకుభయపడినచో, ఎట్టి ధర్మమును సాధింపలేము; ఆత్మవిచారణయును చేయలేము

## 4. నిష్కామ కర్మ

మృత్యువు నెదిరింపలేక పోవుటకు ముఖ్యకారణము కామమే. అనగా ఈ శరీరముతో సకల సుఖములను సంపాదింపవలయునను కోరికయే. ఈ కామ మెట్టిదో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు వివరించి చెప్పినాడు, "విషయములను ధ్యానించువానికి వానియందు సంగము కలుగును. సంగమువలన కోరిక పుట్టును. దానివలన కోపము జనించును"

శ్లో॥ ధ్యాయతో విషయా న్ పుంసః సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే॥
[భ. గీ. ౨—౬౩]

"స్వధర్మము నాచరించుచు చచ్చిపోయినను మేలే, కాని పర ధర్మము మాత్రము భయంకరము" అని శ్రీకృష్ణుడు చెప్పగా, అర్జునుడిట్లు ప్రశ్నించెను. "మతి బలవంతముగా నియోగింపబడినవానివలె మానవుడు తనకు ఇష్టము లేకున్నను ఏ కారణము చేత పాపమును చేయుచున్నాడు."

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః (భ. గీ.
(3-36)

అంతుల కాయన యిట్లు సమాధానము చెప్పెను. "రజోగుణ సముద్భవమైన కామమే యిందులకు కారణము. ఇదియే క్రోధ మగుచున్నది. దీనికి ఎంత యాహార మొసంగినను ఇది తృప్తి నొందదు. కావున నిది మహా పాపాత్మకము. కాబట్టి యీ సంసారము నందు దీనిని శత్రువునుగా నెఱుంగుము."

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్
(భ. గీ. 3-37)

కాబట్టి మృత్యువును తెలిసికొనుటకు, మృత్యువై పోకుండుటకు నీ స్వరూపమును చూచుకొనుటకు పాపాచరణమే ప్రతిబంధకము కావున ఆ పాపమునకు కారణమైన కామమును చంపివేయవలయును.

కామము వేఱు, ప్రేమ వేఱు ప్రేమతో మనము బలి (Sacrifice) యగుదుము, కామముతో ఇతరులను బలి చేయుదుము. కావున కామమును ప్రేమయని భ్రమపడరాదు. ప్రేమలో నీవు బలియైపోవుచున్నప్పుడు, దేనిని రక్షించుటకై నీ శరీరమును బలిపెట్టుచున్నావో, అదియే అప్పటికి, తాత్కాలికముగా, నీ స్వరూపమని తోఁచును. కాని అది భ్రమ నీకన్న భిన్నమైన మఱి యొకటి నీ వెట్లగుదువు! కనుక నిన్ను నీవు చూచుకొనవలెనన్నచో, నీకన్న భిన్నమైన దానిని దేనినైనను నిన్నుగా భ్రమింపక, నెమ్మదిగా పరిశీలించుచు, నిన్ను నీవు గుర్తించువఱకు, నీవు కాని దాని నెల్ల త్రోసివేయుచుండవలయును. ఇట్లు విచారించుచున్నచో,

ప్రేమచేత నీ శరీరమును సైతము బలిపెట్టునంతటి త్యాగమునకు సిద్ధపడినావో, ఆ ప్రేమకు అసలాధారము నీవే యని తుదకు గోచరించును అప్పుడు, "ఎవనికైనను తన కొఱకే సర్వము ప్రియమగుచున్నది. ('ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి'-బృహదారణ్యకము) అని శ్రుతి చెప్పిన మాటలు అర్థమగును మరి కామపరత్వమునందు ఇట్టి యవకాశమే లేదు. కామవశునకు ఈవిచారణాయే పుట్టదు. కామపరాయణులైనవారు ఘోర తపస్సులను చేసి మహాశక్తులను గూడ సంపాదింపవచ్చు. అంతమాత్రమున వారిని మహనీయులుగా భ్రమింపరాదు. ప్రముఖులైన రాక్షసు లందఱు మహాతపస్వులే, కాని మహాత్ములు కారు. వారు ఒకప్పుడు వహించు ఇంద్రియ నిగ్రహము కూడ వారి కామపరాయణతకు సాధనమే కాని పారమార్థికము కాదు ఈసందర్భమున రావణుని మరణమును గూర్చి విలపించుచు మండోదరి యన్న మాటలు గుర్తింపఁదగి యున్నవి. "కామమును అరికట్టి మహాతపస్సు చేసి ఐశ్వర్యములను సంపాదించినావు ఆ కామమునిపై అతికోపముతో నీచేత సీతను తెప్పించి నిన్ను సర్వనాశనము చేసినది." కావున కామముయొక్క శక్తిని గుర్తింపవలె. తపశ్శక్తులు కలవారందఱు ధార్మికులని జ్ఞానులని భ్రమించి వారిని ఆశ్రయించి చెడిపోఁగూడదు.

ఇది గుర్తించినవాఁడు కనుకనే ప్రహ్లాదుఁడు తన తండ్రియొక్క తపశ్శక్తులను చూచి మోసపోలేదు. హిరణ్యకశిపుఁడు ఎంత ఘోరమైన తపస్సు చేయఁగలిగినను, ఎన్ని శక్తులను సంపాదించినను, లోకముల నన్నింటిని జయింపఁగలిగినను తన యింద్రియానీకమును చిత్తమును జయింప లేకపోయినాఁడు. దీనినే ప్రహ్లాదుడు తండ్రికి గుర్తు చేసినాఁడు

ఉ॥ లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ

భీకర శత్రులార్వురఁ బ్రభిన్నుల జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా
(7-367)

ఇట్టి మహానుభావునకుఁ గూడ చిత్తమునందు కోరికలేవియు లేకుండ పోయినవా లేదా యను సందేహము విష్ణుదేవునకే తీరలేదు. ఆ పరమేశ్వరుఁడు ప్రహ్లాదు నెట్లు పరీక్షించెనో చూడుఁడు

శా॥ సంతోషించితి నీ చరిత్రమునకున్, సద్భద్రమౌ గాక; నీ
యంతర్వాంఛిత లాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం
జింతం జెందకు; భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోక్యుఁడన్
జంతుశ్రేణికి, నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లేదర్భకా॥ (7-369)

ఆ॥ వె॥ సకలభావములను సాధులు విద్వాంసు
లఖిలభద్ర విభుఁడ నైన నన్ను
గోర్కు లిమ్మటంచుఁ గోరరు; రిచ్చెద
గోరు మెద్దియైనఁ గుఱ్ఱ నీవు॥ (7-370)

అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియఁ గోరి వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముండైన యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయంబని తలంచి యిట్లనియె ... ... ... కామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబుకొఱకు నిన్నుఁ జేరితి ... ... రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదురు; రవ్విధంబునం గాదు; నాకుం గామంబు, 'లేదు', నీకుం బ్రయోజనంబు లేదు; ఐనను దేవా వరదుండ వయ్యెద వేని కామంబులు వృద్ధిఁబొందని వరంబు గృపసేయుము; కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమానవిభవుండగు ... ...(7-371)

అట్టి మహాభక్తుఁడు కూడ తనయందు, "కామంబులు వృద్ధిఁ బొందని వరంబు గృపసేయు" మని ప్రార్థించినాఁడు. అనఁగా తన యందు కామబీజము లున్నవని గుర్తించినాఁ డన్నమాట. కనుక నిష్కామత్వము ఎంత దుర్ఘటమో మనము దీనినిబట్టి గ్రహింప వలసి యున్నది. దీనిని సాధించుటకు మన మిప్పుడు చేయుచున్న పనులను నిష్కామముగా చేయుచుండుఁడని పెద్దలు చెప్పియున్నారు. కాని సాధారణముగా ఎవరు ఏపనిని నిష్కామముగా చేయఁలేరు. కొన్నిపనులు మాత్రమే నిష్కామముగా చేయఁదగి యున్నవి. ఏపని వలన ఏఫలము వచ్చునో, ఆ ఫలము కాకుండ చిత్తశుద్ధి కలుగునో, అనఁగా చిత్తములోపల సర్వదోషములకు కారణమైన కామము తొలఁగింపఁబడునో, ఆపనియే నిష్కామముగా ఆచరింపఁదగినది. అది వైదిక కర్మయే. లోకతంత్రములో నేడియు నట్లుండదు. ప్రపంచ వ్యవహారమున ప్రతిపనికి ఏదియో ఫలము కలుగుచునే యుండును. శాస్త్రములో చెప్పిన కర్మలు సక్రమముగా చేసినచో స్వర్గాదులు వచ్చును. ఆ కర్మలనే నిష్కామముగా చేసినచో స్వర్గాదులు రావు; చిత్తశుద్ధి కలుగును. జనకుఁడు వైదికకర్మలు నిష్కామముగా చేసినాఁడు. అతనికి అభయమే (ముక్తి) వచ్చినది గాని స్వర్గాదులు రాలేదు. ఏ ఉపాసననైన సక్రమముగా చేసినచో ఉపాస్యదేవత ప్రత్యక్ష మగును. విక్రమాదిత్యుఁడు సక్రమముగా ఉపాసనచేసి రాజ్యమును స్థాపించినాడు. కోర్కెలు ప్రబలముగా నున్నప్పుడు ఉపాసనచేసి ధర్మమార్గమున వానిని తీర్చుకొనుట తప్పుగాదు. క్రమముగా కర్మలను నిష్కామముగా చేయుటకు ప్రయత్నింప వలయును. ఇట్టి రహస్యములు తెలియక ప్రతివాఁడు రాజకీయ నాయకులు కూడ, ప్రతిపని, వితంతూద్వాహము వంటి పనిని కూడ, నిష్కామముగా చేయుచున్నామని చెప్పుట, రావణుఁడు ఇంద్రియనిగ్రహము చేసినావని చెప్పుట వంటిదే యగును.

దేనిని సంపాదించుటకైనను సాధకుఁడు, సాధనము, సాధ్యము, అను నీ మూఁడును శాస్త్రపద్ధతిలో నుండవలెను. కొంతమంది బాటసారులు ఒకచోటికి వెళ్ళుచున్నారు వారికి ఆకలి యైనది. త్రోవలో నేవో కొన్ని చెట్లు కన్పింపఁగా వాని కాయలను తిన్నారు. అప్పుడు కడుపులో నొకమంట బయలు దేరినది. మఱికొంత దూరము వెళ్ళిన తరువాత ఆ మంట పోవుటకై మరల నేవో చెట్లకాయలను తిన్నారు. అవి ఉన్మత్తకాయలని వారు గమనింపలేదు. అంతటితో వారికి పిచ్చి పుట్టినది. ఆ పిచ్చిలో రాత్రి పండ్రెండు గంటలప్పుడు వారు ఒక దుర్గమును చేరి అక్కడనున్న ద్వారపాలకులతో పోట్లాడినారు. ఆ ద్వారపాలకులు వీరిని కొట్టి తఱిమి వేసినారు. కొందఱు చనిపోగా, మిగిలినవారు పాఱిపోవుచు కందకములోఁబడి మొసళ్ళచే భక్షింపఁబడినారు. ఇది త్రిపురారహస్యములో నొక కథ. దీనినిబట్టి మనకుఁ దోఁచినదంతయును మనకున్న బాధలను తీసివేయునని ఆచరించకూడదు అని గ్రహింపవలసియున్నది. అట్లు చేసినచో ఉన్న బాధలు పోక పోగా, ఇంకను అనర్థము కల్గగలదు. కాఁబట్టి ప్రతివిషయమునను శాస్త్ర ప్రామాణ్యమును పాటింపవలయును; అట్టి శాస్త్రీయకర్మాచరణమే క్రమముగా చిత్తశుద్ధిని కలిగించును.

## 5. తాదాత్మ్యము

ఏది కావలెనని మనము కోరుచున్నామో అదియే మనమైనట్లు భావింతుము. ఒకఁడు మేడ కట్టవలెనని యనుకొనుచు; దానిని గూర్చియే భావించుచుండును. మేడ కట్టలేకపోయినప్పుడు వాఁడు, అట్లు కట్టలేక లేకపోవుట, తనకేదో పెద్ద అవమానమైనట్లు, చివరకు ఆమేడయే తానైనట్లు, అది లేకపోయినచో తన బ్రతుకే వ్యర్థమైనట్లు బాధపడును. మఱి రామునకు పట్టాభిషేకమున్నను, వనవాసమున్నను ఒక్కటిగానే తోఁచినవి. దశరథునకు మాత్రము రామునికి పట్టాభిషేకము జరుగకపోవుట తనకు బ్రతుకే లేకపోవుటగానే తోఁచినది.

మనము మన మనుకొన్నదానితో తదాత్మ్యమే పొందుదుము. అందు వలననే అనుకొన్నవి జరుగనప్పుడు మన బ్రతుకే వ్యర్థమైనట్లు బాధ పడుచున్నాము. మనము ఎంత చిన్న విషయములో ఎంత యారాట పడుదుమో చూడుడు. ఉదయమున క్షురకర్మ చేయించుకొనవలె నని మంగలిని పిలిపించినప్పుడు, అతని రాక ఆలస్యమగు కొలది మనము పడు నాతురత చూచి తీరవలసినదే. అతడు వచ్చువరకు మఱొక పని తోచదు. మన మేది సంకల్పించినను ఇంతే. అదిజరుగు వఱకు ఏదో క్షోభపడుచునే యుందుము. కాబట్టి యథార్థముగా మనస్సు సంగతిని గుర్తింపవలయును. "నేను భావములతో పోరాడు చున్నాను కాని మనుష్యులతో కాదు" ("I am fighting against ideas but not against men"- Germen Philospher, Theory of Superman) "సంకల్పించుచు ఆరాటపడుచున్న యీ వ్యక్తి నేను కాదు; ఈ వ్యక్తికి పై వాడను; అని తెలిసికొనుము. అప్పుడు నీలోని మృగమును పట్టుకొనుట యెట్లో అవగత మగును —" అని నీషి అను జర్మను వేదాంతి చెప్పినాడు.

## 6. జన్మాంతరములు

ఈ జగత్తునకు కారణమైన యీశ్వరుడు మనకును కారణమే అనుట సమంజసము. అయినచో ఈశ్వరుడు మన జన్మలకు ఎట్లు కారణ మగుచున్నాడు? ఆయన మన జన్మలకు కారణమైనచో సుందరులు వికలాంగులు, బుద్ధిమంతులు బుద్ధిహీనులు, మొదలుగ యీ యనంతములైన భేదము లెందుల కున్నవి, యను ప్రశ్న యుద యించును. ఈ భేదములకు సమాధానము కుదుర్చుకొనుటకే పూర్వ జన్మ, పునర్జన్మ కలవను సిద్ధాంతము బయలుదేరినదని కొందఱు దురు. అప్పుడు ఒక వ్యక్తి పుట్టుటకు పూర్వమున్నడా? లేద అను ప్రశ్న యుదయించును. ఈ ప్రశ్నలకు ఏ మతమువా

నను సమాధానము చెప్పవలసియే యున్నది. పుట్టకపూర్వము ఉన్నచో జీవుఁడు ఎక్కడ ఉన్నాఁడు? దేవుని దగ్గఱ ఉన్నాడా? దేవుని దగ్గఱ ఉన్నచో సుఖముగా గదా ఉండవలె? అట్లు సుఖముగా ఉన్నవాఁడు ఇక్కడికి ఎందుకు వచ్చినాఁడు? జవాబులేదు. తోళ్ళ వర్తకుఁడు చెప్పులు, పటకాలు, టోపీలు మొదలుగా అన్నింటిని తోలుతోనే చేయును. కాని చెప్పులు కాలికి, పటకాలు నడుమునకు, టోపి తలకు పెట్టుకొందుము చెప్పులను వాకిటిలోనే వదలిపెట్టి పటకాను, టోపీని ఇంటిలోనికి తీసికొని పోవుదుము. తోళ్ళవర్తకునకు తోలు దృష్టితో అన్నియు ఒకటే. ఉపయోగ దృష్టితో మనము ఆ వస్తువులలో భేదమును పాటించుచున్నాము ఇట్లే మనదృష్టితో సృష్టిలో కొద్దివి, గొప్పవి, మంచివి, చెడ్డవి, అని యెన్ని భేదములున్నను దేవుని దృష్టిలో అన్నియు ఒకటే. అందఱును సమానమే యని కొందఱు సమాధానము చెప్పుకొనుచున్నారు. ఉద్యోగము దొరకక కొందఱు బాధపడుచుండఁగా, దొరికిన యుద్యోగములో అభివృద్ధిలేక మఱి కొందఱు వ్యథనొందుచున్నారు. అందఱును సమానులేమైనచో ఈ కొఱత, విచారము ఎందులకు? చెప్పులు, పటకా, టోపీ మొదలుగా అన్ని వస్తువులలో తోలు ఉన్నట్లే మానవులందఱియందును భగవత్త్వము సమానముగనే యున్నది కదా? నిజమే, మఱి తోలు అచేతనము; మనము చేతనులము. కాబట్టి మనకు విచారము, దిగులు, సంతోషము అను భేదము లున్నవి. వస్తుతత్త్వము ఒకటే అని యనుకొన్నంతమాత్రమున ఈ భేదములు పోవుటలేదు; దిగులు తీఱుటలేదు. కనుక పై పిచ్చి సమాధానముతో బుద్ధిగలిగిన వాఁడెవఁడును తృప్తి పడఁడు

పోనీ చచ్చిపోయిన తరువాత ఎక్కడనో ఒకచోట అందఱు సమానముగా నుందురా? అక్కడ ఈ భేదములు, దుఃఖములు ఉండవా? అసలు తరువాత ఉండవలెనన్నచో చచ్చిపోవునపుడు ఉండవలెఁగదా! అప్పుడు లోకుల కంటఁబడి నేను కన్పించను గనుక లేనివాఁడనే. వారి దృష్టిలో నేను లేకపోయినచో పోనిండు అసలు నేను శరీరమును వదలి యథార్థముగా ఉన్నచో ఎట్లుండును, ఏమి చేయుచుండును మృత్యు కాలమందు మృత్యువును నేను చూడఁగలనా? నేను దానిని చూడఁగలిగినచో, నా శరీరమును హరించుచున్న యా మృత్యువుకు లోఁబడుటకన్న నవమానము, ఆపద మఱియొకటి కలదా? మనకు వట్టి యహంకారమే. మృత్యువుపైఁబడినపుడు జంతువు లెట్లు లొంగిపోవుచున్నవో మనమును అట్లే లొంగిపోవుచున్నాము. మన యీ వట్టి యహంకారమునకు నిదర్శకముగా ఒక సామెత కలదు. "గుఱ్ఱ మూడెక్కె రాజు మేడెక్కె" అనఁగా మనుష్యుఁడెంత వాఁడైనను పశువుతో సమానముగానె పగలంతయు తిండికై తిప్పలుపడి రాత్రి కాఁగానే విశ్రమించుటకు ఏదో ఒకచోటు చూచుకొనుచునాఁడన్న మాట. మానవుఁడై పుట్టి అంతకుమించి విచారణ యేమియు చేయనన్నచో పశువునకు వానికిని భేదమేమున్నది?

పశువులకు లేని బుద్ధిశక్తి మనకు ఉన్నది అదియే ఒక విశిష్టత. మన బుద్ధికిఁగల శక్తి అమేయము. అది రూపమున్న వస్తువులనే కాక రూపము లేని వానినికూడ గ్రహింపగలదు. వాయువునకు, ఆకాశమునకు సుఖదుఃఖాలకు రూపము లేదు, కాని వానిని బుద్ధి గ్రహించుచునే యున్నది కాని వేదములో చెప్పఁబడిన పెక్కు విషయములను గ్రహింపలేకున్నది. మనము దేవతల నుద్దేశించి యాగహోమాతుల నొసఁగినచో అగ్నిహోత్రుఁడు వానిని దేవతలకు చేర్చుచున్నాఁడని శ్రుతి చెప్పుచున్నది. ఇది మన సాధారణ బుద్ధికి గోచరము కాదు. కాని ఆ బుద్ధికి శాస్త్రములో చెప్పిన సంస్కారమును కలిగించినచో అది యిట్టి యతీంద్రియ విషయములను కూడ గ్రహింపఁగలదు; అప్పుడు మృత్యువును జన్మాంతరములను కూడ అది చూడఁ గలదు.

# అందఱు సమానులు కాదు

## 1. మానవ జన్మము

ఎవని పూర్వజన్మకర్మ ఎట్లున్నదో, అట్టి జన్మయే వానికి కలుగుచున్నది. అంతేకాని పక్షపాతము కలిగిన యెవఁడో యొక దేవుఁడు తన యిష్టమువచ్చినట్లు నిష్కారణముగా సుఖదుఃఖములను కలిగించుచు మనుష్యులను సృష్టించుట లేదు. సృష్టిలో మనుష్య జన్మము కాక పశుపక్ష్యాది జన్మలు, దేవతాజన్మలు కూడ నున్నవి. అట్టి జన్మలలో ఏది యుత్కృష్టమో, అట్టి మంచి జన్మమును మనము సంపాదించుకొనుటకు ఏ పుణ్యకర్మలు చేయవలయునో శాస్త్రములలో విశదముగా చెప్పఁబడి యున్నది. అనగా మానవ జాతిలో ఎవడు ఏవర్ణము కావలెనని కోరుకొనునో ఆవర్ణమునం దాతఁడు పుట్టఁగలఁడు. ఒకానొక వర్ణమున జన్మించిన తరువాత, అందుండి ఇంకను మహోన్నతములైన దేవతాది జన్మలను పొందుటకు ఏయే కర్మలను అనుష్ఠింపవలెనో శాస్త్రములో చెప్పఁబడియే యున్నవి. జంతువులలో నరజన్మ దుర్లభము. అట్టి మంచి జన్మను పొంది, ఇంకను మహోన్నత స్థితుల నందుకొనుటకు గొప్ప యువకాలము దొరికినప్పుడు, ఆ యువకాలమును ఇటు అభ్యుదయమునకుఁ గాని, అటు నిఃశ్రేయసమునకు గాని వినియోగించుకొనక గ్రామ్యసుఖములతో కాలము గడుపువాఁడు పశుప్రాయుడు. నేను మనుష్యుఁడను, పశువును కాదు అని తెలుసుకొనుట, నేను పశువువలె వర్తింపను అని యహంకారము నొందుట చాల ఆవశ్యకము. పిల్లవాఁడు కాలువలో నీళ్లను నోటితో త్రావుదునా అని యడుగును. 'నీవేమి దూడవటరా' యని అడిగినచో వాఁడు నవ్వును. అనఁగా ఎక్కువ జన్మయెత్తినను తక్కువజన్మ బుద్ధులు తిరిగి పుట్టుచునే యుండునన్న మాట. విద్యా విజ్ఞానముల చేత శాస్త్రాచార్యోపదేశము చేత తన స్థితి నుండి క్రింద పడకుండ పైకిపోవుటకే ప్రతివాడు ప్రయత్నింపవలెను.

నేను మనుష్యుడను అని యనుకొన్నమాత్రమున చాలదు. మనుష్యత్వములో కూడ తన యంతస్తును గుర్తింపవలె. బ్రాహ్మణుడుగా పుట్టినవాడు 'నేను బ్రాహ్మణత్వమను నొకయంతస్తులో ఉన్నాను, దీని నుండి పైకి పోవలయును కాని, క్రిందికి దిగజారరాదు' అన్న యభిమానము అహంకారము కలిగినప్పుడే తాను చేయవలసిన శాస్త్రబోధితములైన కర్మలేమో తెలిసికొనును. అట్లే మగవాడుగా పుట్టినంత మాత్రమున చాలదు; స్త్రీ పురుష జన్మలలో తారతమ్యమును తెలిసికొని స్త్రీకన్నా ఉదాత్తముగా వర్తించుటకు ప్రయత్నింపవలయును.

తన్ను తాను తెలుసుకొనుట సులభము కాదు. తాత్కాలికములైన యీ స్త్రీ పురుషాది భేదములను వదలి అసలు తాను ఎట్లున్నాడో తెలిసికొనవలె. శాస్త్రములందు దీనికొక ప్రత్యేక ప్రణాళిక కలదు. దీని ననుసరించుటకు అధికారమును సంపాదింపవలె. ఇది యంతయు "విద్య" అను పేర శాస్త్రమునందు కలదు. ప్రస్తుత స్థితిలో ఎవడైనను తన్ను ఎట్లు తెలుసుకొనుచున్నాడు? 'పాంచభౌతికమైన శరీరము, చచ్చువఱకు అన్నియవస్థల యందు నుండు ప్రాణము, ఆలోచించు మనస్సు—ఇవి యన్నియు నేను' (భూత శరీరః, ప్రాణమయః, మనోరూపః అస్మి) అని అనుకొనుచున్నాడు మఱి యివి మాత్రమే నేనయినచో, ప్రాణము పోయినచో నే నుండను గదా! ప్రాణము పోయిన తరువాత కూడ నే నుండుదునని తెలిసికొనుటకు, ఇంతకు పై మెట్టుకు వెళ్లవలెను. అనగా, "భూతములే శరీరముగా కలవాడను కాను; ప్రాణమే శరీరముగా కలవాడను" అని తెలిసికొన్నచో అప్పుడు, "ప్రాణము పోయినచో నేను పోను; ఈ ప్రాణముతో కూడ ఎప్పుడును మనస్సు ఉండును" అని, తెలియును. (ప్రాణ శరీరః మనోమయః భారూపః) పిమ్మట క్రమముగా నేను జ్ఞాన స్వరూపుడను అని తెలియును. ఈ విధముగా ఉపాసింపవలెనని శాస్త్రములలో చెప్పఁబడి యున్నది. దీనికి అధికారము సంపాదింపవలె. ఈ శరీరమే నేను కాదను జ్ఞానము ఎవ

రెవరికి పుట్టుకతోడనే యెంతెంతకలనో అక్కడినుండి పైకి పోక వలెను. కనుక దీనినే "ప్రతికి తత యధికారము కలదు" అని ఒక్కొక్క జన్మ నుద్దేశించి శాస్త్రము చెప్పుచున్నది.

## 2. అందఱికిని ఒకే ధర్మమే కాదు.

అందఱు అను బహువచనములోనే ఒక్కొక్కఁడు ఒక్కొక్క వ్యక్తిత్వము కలవాఁడని (Differently Constituted individual) స్పష్టముగా నున్నది. కాఁబట్టి అందఱకు ఒకేధర్మము పనికి రాదు. ఇదియే భగవద్గీతలో స్వధర్మము, పరధర్మము అని వివరింపబడినది. జన్మమును బట్టి, స్థితిని బట్టి, జ్ఞానముయొక్క దశను బట్టి ఎవని ధర్మము వానిదే. సోక్రటీసు యొక్క అంతస్తును చూడుఁడు. అతఁడు తన శిష్యులతో ఇట్లు చెప్పినాఁడు. "నేను చచ్చిపోయిన తరువాత నా శరీరమును మీ యిష్టమువచ్చినట్లు చేయుఁడు. కాని యీ శరీరము సోక్రటీసు కాదనిమాత్రము తెలిసికొనుఁడు." కాఁబట్టి 'దేహము నేను' అను సామాన్య జ్ఞానమునుండి, "దేహము నేను కాదు" అను విశేష జ్ఞానము వఱకు పుట్టిన ప్రతివాఁడు ఒక్కొక్క స్థాయిలో (Grade) ఉండును. పుట్టిన ప్రతిజంతువు ఒక వ్యక్తియే. ప్రతివ్యక్తికి తన్నుగూర్చిన జ్ఞానమునందు ఒక పరిణామము ఏర్పడి యుండును. అందువలన ప్రతివ్యక్తియు తాను అందుకొన్న మెట్టు నుండి పైకి పోవుటకు చేయవలసిన కర్తవ్య విధానము వానికి స్వధర్మము. అట్లుకానిది పరధర్మము

మనశరీరమును గూర్చియే మనకు తెలియక బాధపడుచున్నాము. ఒకఁడు చచ్చిపోయిన తరువాత కనఁబడు శవమును వాని శరీరమను చున్నాము. కాని అసలు నిజము మనకు తెలియదు. "హసితం రుదితం ... ..." ఇవన్నియు ఈ శరీరము యొక్క అంగములే అని వేదము చెప్పుచున్నది. ఇవి ఆత్మ యొక్క అవయవములు కావు. జీవదవస్థ, మృతావస్థ అని శరీరమునకు రెండవస్థలున్నవి.

ఈ యవస్థల యదార్థ రూపము శ్రీదైకవేద్యము. నేన
బ్రతికియున్నా నన్నచో ఇంకను చావలేదన్నమాట. మా అబ్బాయి
పెద్దవాఁడు అగుచున్నాఁడన్నచో మృత్యువునకు దగ్గఱగా వె
చున్నాఁడని తెలుసుకో. ఇట్లనుకొనుటకు అభిమానము పోవ
బ్రతుకు ఒక ప్రకృతి అని తెలిసినచో చావును చూడఁగలవు. బ్రతు
తో తాదాత్మ్యమును పొందుట అను ప్రమాదము, అనగా పొరపా
పోవలె "ప్రమాదో ధీమతా మపి" ఆహార నిద్రా భయ మైథు
ములను పొందుటలో తప్పులేదు, ఒప్పులేదు అది సామాన్య జం
స్వభావము. కనుక ఈ జంతుత్వమును దాటవలయును. మా
శ్రీదైనకు ఒకలక్ష్యము (Goal) ఉన్నప్పుడే తప్పులు, ఒప్పులు బయ
దేరును. అసలు తప్పనఁగా నేమి! ఒప్పనఁగా నేమి! అవి మనము
పని యనుకొనుట వలననే యున్నవా! అనుకొనకున్నచో లే
మనము ఏర్పరచుకొన్న లక్ష్యమునకు మనము అవలంబించుచు
యాహారాది ప్రవృత్తి అనుకూలమైనచో అది ధర్మ మనిపిం
కొనును; ప్రతికూలమైనచో అధర్మమగును ప్రతివానికి బ్రతుకన్న
సంతోషమే, చావన్నచో దుఃఖమే అట్లే ఈలోకములో
ముగా నుండవలయుననియే కాక, చనిపోయిన తరువాత తానెక్క
డైన నున్నచో అక్కడ కూడ సుఖముగా నుండవలయునని
ప్రతివాడును కోరుకొనుచుండును. మఱి స్వధర్మ మొక్కటే యుండి
సాధనము శాస్త్రీయముగా కర్మలు చేయు వారికి ఇహపర
ములలో సుఖము కలుగును. కలియుగములో స్వధర్మములు సాగు
కాలగతిమున వచ్చు కల్లోలములతో నీకేమి సంబంధము! వా
గూర్చి నీవేమి చేయగలవు! కాలముసంగతి లోకముసంగతి
కేదులకు. నీసంగతి నీవు ఆలోచించుకొనుము నీవున్న స్థి
నీవెట్లు బాగుపడఁగలవో అది ఆలోచించుకొనుము. నీవు స్వత
ముగా కాలగతులను ఎంతవఱకు ఎదుర్కొనఁగలవో అంతవ
స్వధర్మము నాచరించుచుండుము. నీ జవాబుదారి అంతవ
యుండును. ఆ స్వధర్మాచరణము చేతనే నీవు ముందుకు పోగ

## 8. భంగీజన్మము పుణ్యప్రదమా!

ఈకాలమున ధర్మమును తెలిసికొనుట సులభము కాదు. ధర్మ మనఁగా నేమి! దేని నవలంబించినచో బుద్ధి వికసించును. ఈ ప్రశ్నలు పెద్దవారిని కూడ కలవరపెట్టుచునే యున్నవి. ఎవఁడైనను ఎంతో పుణ్యాత్ముఁ డయిననే తప్ప భంగి అయి పుట్టఁడని గాంధి మహాత్ముఁడన్నాఁడుట. సంఘము అభివృద్ధి నొందుటకు అన్ని యితర కృత్యములవలె పాకీవాని పని కూడ అవశ్యకము. గనుక ఇంత లోకోపకార బుద్ధికి ఎంత పూర్వపుణ్య ముండవలెనని ఆయన యుద్దేశము. ఎంతో పుణ్యాత్ము డయిననే తప్ప బ్రాహ్మణుఁడై పుట్టడని శాస్త్రము చెప్పుచున్నది. ఒక బెంగాలీవాఁడు అరవింద ఘోషునకు పైవిషయమును గూర్చి వ్రాయఁగా, ఆయన వ్రాసిన జవాబిది. "ఈవిషయములలో మహాత్ముఁ డవలంబించిన యాలోచనము హైందవ దృష్టి యనుటకన్న క్రైస్తవ దృక్పథమనియే చెప్పవలసి యున్నది. తన్ను తక్కువ పఱచుకొనుట, అణకువ కలిగి యుండుట, మానవసమాజమును గాని భగవంతుని గాని సేవించుటకై తక్కువస్థితిని (Low Status) అంగీకరించుట, యనునవి క్రైస్తవ దృష్టిలో ఉన్నతములైన యాధ్యాత్మిక సాధనములే కాక, ఆత్మ యొక్క అభ్యుదయమునకు ఉదాత్తములైన యవకాశములు. ఈ దృష్టిలో వర్ణవిభేదముల తారతమ్యము పొసఁగదు. అందఱును భగవంతుని యెదుట సమానులే అను సిద్ధాంతముపైననే మహాత్ముఁడు వర్ణముల విధానమును అంగీకరించు చున్నాఁడు; అనఁగా తన ధర్మమును చేయుచున్న భంగి, స్వధర్మమును ఆచరించుచున్న బ్రాహ్మణునితో సమానుఁడే; వృత్తులందు విభాగ మున్నది (Division of function) కాని తారతమ్యము లేదు (Hierarchy of functions). అన్నమాట, అది యొక దృష్టి. తారతమ్య మున్నదనుట మఱియొక దృక్పథము.

ఇరుపక్షములకును వారికి తగిన యాధారములు, సహేతుకత్వమును కలవు. వారు వానిని సంపూర్ణముగా విశ్వసింతురు. కాని వారి దృక్పథములు ఒక్కొక్కటి వస్తుస్థితి యొక్క ఒక్క భాగమును మాత్రమే గ్రహించుచున్నవి. అన్ని విధములైన వృత్తులును భగవంతుని దృష్టిలో సమానములే, అందఱి యందును ఉన్న బ్రహ్మపదార్థ మొక్కటే, యని చెప్పుట ఒక విధమైన సత్యము. కాని భగవదభిముఖముగా అందఱి యందును ఏర్పడి యున్న పెంపు (Development) మాత్రము సమానముగా లేదనుట మఱొక విధమైన సత్యము. భంగిగా జన్మించుటకు ప్రత్యేకమైన పుణ్య ముండవలయునను తలంపు, వారి యెడల ఆయనకుఁ గల భావమును ప్రకటించు బలిష్ఠములైన యతిశయోక్తులలో నొకటి. ఇట్టిమాటలు ఆయనకు సామాన్యములే. ఇవి వినువారి మనస్సులను గాఢముగ ఆకర్షించును. ఈవిషయమున ఆయన యభిప్రాయ మిట్లుండును, బ్రాహ్మణుని వృత్తివలెనే భంగి యొక్క వృత్తియు సమాజమునకు ఆవశ్యకము. కాని ఆవృత్తి యిష్టమైనది కాదు గనుక, అట్టి వృత్తిని హృదయపూర్వకముగా స్వీకరించుటకు ప్రత్యేకమైన ధర్మవీరత్వము ఉండవలెను. ఒకానొకఁడు వీరోచితముగా తన పుణ్యమునకు ఫలముగా అట్టి వృత్తిని ఎన్నుకొనుచున్నాడు. మఱి జీవునకు తన జన్మను ఆ విధముగా ఎన్నుకొనుటకు స్వాతంత్ర్య మున్నదా? ఇది సంభావ్యము కాదు. కొన్ని పరిస్థితులయందు సమాజమునకు భంగియొక్క వృత్తి ఆవశ్యకమే. అది లేకపోయినచో సమాజము యొక్క ఉనికియే దుర్ఘటము, సామాజికజీవనమే సాగియుండక పోయినచో బ్రాహ్మణజీవితమునకు ఆస్పదమైన సంస్కృతియొక్క అభ్యుదయము కూడ సంభవించి యుండదు. కాని అనాగర స్థితినుండి నాగరిక దశకు

సమాజము పెంపొందుటకు భౌతికములైన యవసరములను తీర్చ నట్టి వృత్తులకన్న సాంస్కృతికమైన యభివృద్ధియే చాల విలువగల దనుట స్పష్టము. జాతియును నాగరికతాభివృద్ధి వలన శాస్త్ర విజ్ఞానముచే నిర్మింపబడు పరికరములవలన పాకీవారిపని చాలవఱకు తగ్గింపఁబడుటయే కాక ఒకప్పటికి పూర్తిగా అదృశ్యమైనను కావచ్చును కాని అది యంత్రములచే జరుగునది కాఁబట్టి, నిరాడంబరమైన జీవితవిధానమునకు (Simple life) భిన్నమైనది కాబట్టి, దానిని మహాత్ముఁ డంగీకరింపక పోవచ్చును. ఏమైనను బ్రాహ్మణుని జీవితము కన్న భంగీజీవితము శ్రేష్ఠమైన దనుట, అది ప్రత్యేకమైన పుణ్యమునకు ఫలమనుట సత్యము కాదు.

బ్రాహ్మణుఁడుగా జన్మించినంత మాత్రముననే యొకఁడు తక్కిన వారికన్న శ్రేష్ఠుఁడగునని చెప్పు సంప్రదాయదృష్టి కూడ సహేతుకము కాదు, సమర్థనీయమును కాదు. ఆధ్యాత్మికదృష్టి లేక సత్సంస్కారము, కలిగినవాఁడు భంగిగా జన్మించినను ఆధ్యాత్మికదృష్టియే ఉండక సంసారమునందు నిమగ్నుఁడై సంస్కారహీనుఁడై యున్న బ్రాహ్మణునికన్న, దివ్యత్వమునకు సంబంధించిన విలువల దృష్టిలో (Divine Values) శ్రేష్ఠుఁడే జన్మకును విలువ కలదు; కాని ప్రధానమైన విలువ మానవుని యందే యున్నది. అతనిలోని యాత్మ అతని స్వభావము సందేస్థాయిలో అభివ్యక్త మగుచున్నదో ఆ స్థాయిని బట్టి విలువ యేర్పడును. (24-12-1936)

[The view taken by the Mahatma in these matters is Christian rather than Hindu - for the Christian self abasement, humility, the acceptance of a low status to serve humanity or the Divine are things which are highly spiritual and the noblest privilege of the soul This view

does not admit any hierarchy of castes; the Mahatma accepts castes but on the basis that all are equal before the divine; a bhangi doing his dharma is as good as the brahmin doing his, there is division of function but not hierarchy of functions That is ne o view of things and the hierarchic view is another, both having a stand point and logic of their own which the mind takes as wholly valid but which only corresponds to a part of the reality. All kinds of work are equal before the Divine and all men have the same Brahman within them, is one truth but that development is not equal in all, is another. The idea that it needs special punya to be born as a bhangi is of course one of those forceful exaggerations of an idea which are common with the Mahatma and impress greatly his hearers. The idea behind is that his function is indespensable service to the society, quite as much as the brahmin's ,but that being disagreeable, it would need a special moral heroism to choose it Voluntarly and he thinks as if the soul freely chose it as such a heroic service and as a reward of righteous acts . but that is hardly likely. The service of the scavanger is indispensable under certain conditions of society, it is one of the primary necessities without which society can hardly exist and the cultural developments of which the brahmin life is part, could not have taken place. But obviously the cultural development is more valuable than the service of the physical needs for the progress of humanity as opposed to its first static condition, and that development can even lead to the minimising and perhaps the entire disappearance by scientific inventions of the need for the functions of the scavengers But that I suppose the Mahatma would not approve of as it would come by machinery and would be a departure rom the simple life.

In any case it is not true that the bhangi life is superior to the brahmin life and the reward of especial righteousness. On the other hand, the traditional conception that a man is superior to others because he is born a brahmin is not rational or Justifiable A spiritual or cultured man of pariah a birth is superior in the divine values to an unspiritual and worldly minded - or a crude and uncultured brahmin Birth counts, but the basic value is in the man himself, in the soul behind and the degree to which it manifests itself in his nature.—— Sri Aurobindo—24-12-1936]

## 4. మహాత్మా గాంధి

తాను ఒకరికంటె ఎక్కువగా నుండవలయుననియే మనుష్యుఁడెప్పుడూ కోరుచుండును డబ్బుకలవాఁడు ఎక్కువగా అనుభవించుచున్నాఁడని నీవు తలంచుచున్నావు, అట్టి సౌఖ్యమునుగాని, అంతకంటె మించిన భోగమును గాని అనుభవింపవలయునని నీకున్నచో, నీవు చేయవలసినపని యేమో వేదము చెప్పుచున్నది. అట్లు గాక అవతలివానిపై ఈర్ష్యచేత వానిని చంపిన యెడల వానికి సుఖము లేకుండ చేసినాననెడు తృప్తి తప్ప నీకేమి చేకూరుచున్నది? ఇంత మాత్రము కూడ తెలిసికొనలేని మందబుద్ధి మనుష్యుఁడు. ఒక ధనవంతుని (Capitalist) తల బద్దలు కొట్టిన నీకేమి లాభము వచ్చును? ఇట్టి పాడు బుద్ధులను గూర్చి విష్ణుపురాణములో కలియుగధర్మములందు చక్కఁగా చెప్పఁబడినది.

నీకు సంపద కావలెనన్నచో దానికి తగినట్లుగా పూజలో, ఉపాసనలో అనుష్ఠింపవలె. ఈ పూజలవలన, ఉపాసనలవలన సంపదలు కలుగునని యేమి నమ్మకము, వీనికిని వానికిని కార్యకారణ సంబంధ మేమి యని నీవు ప్రశ్నింపవచ్చును. నిజమే మనకు అనేక

విషయములలో కార్యకారణ సంబంధము గోచరింపదు. శివునకు బిల్వము, విష్ణువునకు తులసి ఎందుల కిష్టము అని యడిగినచో సమాధానము చెప్పలేము. కాని మనకు తెలియనంతమాత్రమున అది నిర్హేతుకమని యెట్లు చెప్పగలము? మన బుద్ధి కందని విషయములు అనేకములు కలవు, ధర్మానుష్ఠానమువలనఁ గాని బుద్ధి వికసింపదు. అదియును నిష్కామముగా చేసిననేతప్ప వస్తుతత్త్వము గోచరింపదు. తపస్సుచేసినచో బుద్ధికి అతీంద్రియదృష్టి కలుగును. అప్పుడు శాస్త్రములో చెప్పిన సాధనములకు ఫలములకును కార్యకారణ భావము గోచరించును. కొన్ని విషయములలో ఆ కార్యకారణ భావము కొంచె మాలోచించినచో మనకే గోచరించును. ఒక్కొక్క మనో భావము ఒక్కొక్క భౌతికరూపము ననుసరించి వ్యక్తమగుచుండును మనకు ఎవరియందు పూజ్యభావము కలుగునో వారికి మనము సంపాదించిన పదార్థములను ముందుగా అర్పించి తరువాత మన మనుభవింతుము. వారియందు మనకుఁగల గౌరవమునకు ఇది బహిరంగ స్వరూపము. ఇదియే పూజ. ఎవఁడు దేనిని తినుచున్నాఁడో దానిని తన యిష్టదేవతకు నివేదించి తినుమని శాస్త్రము చెప్పుచున్నది ఇట్లు ప్రతిదినము చేయుచున్నచో అహంకారము తగ్గి, చిత్తము నిర్మలమై భక్తి పెంపొందును, ఉత్తమ భావములును కలుగుచుండును. ఈస్థాయి భేదముల ననుసరించియే పరాశక్తి భక్తుల ననుగ్రహించి, ఆయా దేవతారూపములను, ఆయా పూజా విధానములను, ఆయా పూజాద్రవ్యములను నిగమాగమరూపమున తెలియజేయు చున్నది. శ్రుతికి అనుకూలమైన యుక్తుల నెఱుఁగక, శాస్త్రముల చూడక శాస్త్రీయముగా మాటాడుచున్నామని కొందఱందురు వారి మాటల ప్రమాణము కాదు. ఒక యుదాహరణము చూడుఁడు 'ఆత్మజ్ఞానము కలిగినవారి కిదియే తుదిజన్మము; వారికి మరల జన్మ యుండదు' అని కొందఱు చెప్పుదురు. ఇది నిజము కాదు. వ్యాస

భగవానుఁడు శంకరాచార్యులవారు ఆజన్మజ్ఞానులు. సూర్యుఁడు చంద్రుఁడు మొదలగు నధికారపురుషులలో కూడ కొందఱు బ్రహ్మజ్ఞానులు కలరు. కావున బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత మరల జన్మము ఉండదని చెప్పుటకు వీలులేదు. కాఁబట్టి శాస్త్రమును చక్కఁగా పరిశీలించినఁ గాని అందలి తాత్పర్యము చక్కఁగా తెలియదు. అన్ని సందర్భములలో కేవలముగా మనయుక్తులు పనికిరావు. అశ్వత్థామ చిరంజీవి కావున ఇప్పటికిని ఉన్నాఁడు అని యున్నంతనే కొందఱు అతఁడు ఎక్కడ ఉండి తపస్సు చేయుచున్నాఁడు అని ప్రశ్నింతురు. ఈప్రశ్నకు అపోహ మూలము. అందఱకును మనకున్న శరీరములవంటి శరీరములే యుండును అని మనకు ఉన్నట్లే వారికిని భూమివంటిదే యొకటి ఆధారముగా, ఉండవలయునని తలంచుచున్నారు. దేవతలు మొదలగు వారికి మనకు వలెనే పార్థివశరీరము ఉండనక్కఱలేదు, తేజశ్శరీరములు, వాయుశరీరములు, ఆపశ్శరీరములు కూడ కలవు. అవి మన కంటికి గోచరింపక అత్యంత సూక్ష్మములై యుండును. ఆ శరీరములతో వారు అంతరిక్షములలో ఎక్కడనైన ఉండవచ్చును. అశ్వత్థామ మొదలగువారు తమ తమ మండలములలో తపస్సు చేయుచున్నారని గుర్తింపవలెను.

## 5. భూతదయ

నేఁడు చాల చిత్రములైన మాటలు వినిపించుచున్నవి. తీవ్రమైన బుద్ధిశక్తి కలవానికి హృదయ ముండదని, బుద్ధిప్రపంచము వేఱు, భావప్రపంచము వేఱు అని కొందఱు చెప్పుచున్నారు. మనము "శంకరులవారి బుద్ధిశక్తిని, బుద్ధుని హృదయమును" (The head of Sankara and the heart of Buddha) సంపాదింపవలయునని కొందఱు ఉపదేశించుచున్నారు. ఈమాటల కేమి యర్థము. శంకరుల వారికి

బుద్ధిశక్తి యున్నంతగా స్నేహభావములు లేవని, బుద్ధుని యందు దయ మొదలగు భావము లున్నట్లు బుద్ధిశక్తి లేదని యర్థమా! ఈ మాటలవలన ఏమి ప్రయోజనము. కొంచెము ఆలోచింపుడు. బుద్ధుడు ఒక రోజున రోగిని, ముసలివానిని, శవమును చూచి నిర్విణ్ణుడై రాజ్యమునే కాక భార్యను, పుత్రుని, ముసలితండ్రిని కూడ వదలిపెట్టి అర్ధరాత్రి సమయమున ఎవరికిని చెప్పకుండ అడవులకు పరువెత్తి వెళ్లినాడు, అట్లు వెళ్లుటవలన ఆతడు వారి నెంతగా ఏడ్పించినాడు! ఇదిహృదయము కలవాని లక్షణమా! బాధ్యత కలవాని లక్షణమా! మఱి శంకరులవారు తల్లి కొఱకై యెంత ఆరాటపడినారో వారి చరిత్రమును చదివి చూడుడు. అట్టి శంకరులవారికి హృదయము లేదన వచ్చునా! జ్ఞానికి కలుగు భూతదయ అపారము, స్వార్థము, దేహాభిమానము కలిగిన మనకు కలుగు భూతదయ చాల పరిమితము. పాము, పులి మొదలగువానిని చూచినంతనే, అవి బాధపడుచున్నను, మనకు తెలియకపోగా, భయము, కోపము మొదలగు భావములే కలుగును. ఇంక దయ యెక్కడిది! శరీర నిరపేక్షులైన జ్ఞానులకు భయము లేదు కనుక సకల భూతముల యందును అపారమైన కారుణ్యమే యుండును. ఈ గుణమును పెంపొందించుకొనుటకు ఎల్లరును ప్రయత్నింపవలసినదే; పరోపకారము చేయవలసినదే కాని ఉపకారముగా నేదియో చక్కగా విచారింపవలయును. మనము జాలిపడి చేయఁబూనునదంతయు ఉపకారము కానేరదు. ఒకడు వితంతువును వివాహమాడి ఆమెకుగాని, సమాజమునకుగాని ఏదో ఉపకారము చేసినట్లుగా భావించినచో అది భ్రమయే యగును. యథార్థమైన యుపకారములో ప్రతిఫలాపేక్ష యుండదు. త్యాగపరుడుగాక ఎవడును యథార్థముగా ఉపకారము చేయలేడు బుద్ధుడు ఎంత త్యాగమును చేసెనో గమనింపుడు. ఆతడు చేతికందిన రాజ్యభోగములనే త్యజింపగలిగెను.

మతి మనమో, అట్టి భోగములకై ప్రాకులాడుచున్నాము. తత్త్వ దర్శనము సంగతి ఎట్లున్నను ఈ త్యాగము చేతనే, సన్మార్గ ప్రబోధము మూలమున మానవుల నుద్ధరింప వలయునను మహాసంకల్పము చేతనే బుద్ధుడు భగవానుడుగా పెక్కుమంది చేత సంభావింప బడుచున్నాడు. ఆయనకీ త్యాగపరత్వ మెట్లు కలిగినది. ఆయనకు తన పూర్వజన్మలు అయిదువందలు తెలియునట అట్టివానికి ఈ శరీరముల యొక్క నశ్వరత్వము తోచినట్లు మన కెట్లు తోచును? తపస్సు చేసినచో ఎవనికైనను ఇట్టి జ్ఞానము కలగవచ్చును. కలి కాలములో తపస్సులా! ఏ కాలమైన నేమి నీకు విహితములైన నిత్యకర్మలను నిష్ఠతో చేయుము అదియే తపస్సు అగును.

## 6. తపస్సు

వైదిక రాజ్యము ఉన్నప్పుడు బ్రాహ్మణులు మునిపల్లెలలో నుండి తపస్సు చేసుకొనుచుండెడివారు. ఆత్మ దర్శనమునకు కావలసిన శక్తిని సంపాదించుట కొఱకే తపస్సు చేయవలెను. మహిమల కొఱకు కాదు. ఈ కాలమున కూడ మానసికముగా సంసారమును వదలి, వేద విహితములైన నిత్యకర్మలను వదలక, విచారణ చేయుచు, ఆత్మను తెలిసికొన వచ్చును. భోగములను, మమకారమును వదలుటకు ధైర్యము కావలెను. మనస్సును పట్టి నిలుపవలెను కటికివాడైన ధర్మవ్యాధుడు తులాధారుడు మహాజ్ఞానులై యుండిరి. ధర్మవ్యాధుడు తన వృత్తిలో అబద్ధమాడకుండ, అన్యాయము చేయకుండ కుటుంబమునకు వలసినంతవఱకే ధనము నార్జించుచు తల్లిదండ్రులను పూజించుచు జ్ఞాని యయ్యెను తులాధారుడును తూచుటలో ఎన్నడును అన్యాయమును చేయక జీవనమును గడపెను ఎవరి వృత్తులలో వారు సత్యవర్తనులై యుండుటే ధర్మము.

కాలము విపరీతముగా యున్నను మనము బుద్ధిమంతుల మైన యెడల దుశ్చరితములనుండి విరమించి ధర్మము నాచరింప వచ్చును వ్యతిరేక పరిస్థితులందును కష్టములందు ధర్మము నాచరించినచో, నీ మృత్యువుచేత మనము సర్వనాశనమై పోవుచున్నామని వాడలి పోవుచున్నామో, అట్టి మృత్యువునకు మనమే మృత్యువులమని తెలిసికొనఁగలము. కాలములు మనకు అనుకూలముగా ఉండ వచ్చును, ఉండక పోవచ్చును. ఏ కాలములో మనము మా అ వసరము లేదు. రాక్షసులు విజృంభించి యజ్ఞ యాగములను ధ్వంసము చేయుచున్న కాలములలో కూడ మహర్షులు మానితి నారా! ధర్మమును వదలినారా!

## ధర్మము

### 1. ధర్మ మనఁగా నేమి!

ఏది ధర్మము! ఏది అధర్మము! ఇది కేవలము మన బుద్ధికి గోచర మగునది కాదు. పిల్లవానికి తన ధర్మమేదియో వానికి తెలి యదు. వాని యోగ క్షేమములను గూర్చి ఆలోచింపఁగలిగిన పెద్దలే వాని ధర్మమును నిర్ణయింపఁ గలరు. అజ్ఞానులము, సంసారులమైన మన మందఱమును మన ధర్మముల విషయమున పిల్లలమే. మన కేది హితమో మనము నిర్ణయించు కొనలేము. అపౌరుషేయమైన వేదమే మనకేది హితమో, ధర్మమో నిర్ణయించును. పిల్లవాఁడు పెద్దల మాటను పాటించినట్లు మనము ధర్మమును నిస్సంకోచముగా పాటింపవలెను. మనబుద్ధితో విచారించుటవలన ఉపయోగ మంతము వేదవిహితములైన ధర్మములు అవశ్యాచరణీయములే కాని విచా రణార్హములు కావు. మన మెంత యాలోచించినను ఎన్ని విషయ ములను గ్రహింపఁ గలము! జీవితమునకు ఆకారమున్నదా! లేదా

అనేక స్థలములలో యజ్ఞములు జరుగుచున్నప్పుడు ఇంద్రాది దేవ
తలు హవిస్సుల గొనుటకు ఏక కాలమున ఎన్నిచోట్లకు వెళ్ళఁగలరు! ఈ
విషయములను గూర్చి ఎంత యాలోచించినను మనకేమి తెలియును!
తెలియనప్పుడు వేదశాస్త్ర పురాణేతిహాసములలో తెలిసిన మహా
ర్షులు చెప్పిన విషయములను ప్రమాణముగా గ్రహింప వలయును.
దేవతలకు రూపము లున్నదని మన గ్రంథములలో స్పష్టముగా
నున్నది. వారు ఏక కాలమున పెక్కురూపములతో అనేక స్థలములలో
నుండఁగలరు. అయినచో మనకు కన్పింతురా? తప్పక కన్పింతురు.
తపస్సంపత్తిచే శక్తులను సంపాదించినచో దేవతలను దర్శింపవచ్చునని
శంకరులవారు చెప్పినారు. "ఇతిహాస పురాణ మపి..." "భవతి
అస్మాకం..."

## 2. రాజవిద్య

శాస్త్రములలో చెప్పిన ధర్మమును యథాతథముగ గ్రహిం
చుట, దానిని తాను ఆచరించుచు, ఇతరులచే ఆచరింపఁజేయుట
తత్త్వజ్ఞులకే సాధ్యము. ఈ వేదాంత విచారణ దేనికి, ఇది యేమి
కూడు పెట్టునా, గుడ్డ యిచ్చునా అని కొందరు హేళన చేయు
దురు. ప్రజల కందరకు కూడు గుడ్డ లభించి సుభిక్షముగా నుండ
వలయు నన్నచో ధర్మపాలనము ఆవశ్యకము. వేదాంత జ్ఞానము
లేనివాఁడు ధర్మపాలనము చేయలేఁడు వేదాంతము రాజవిద్య.
రాజవిద్య అనఁగా విద్యలలో రాజవంటి దనియే కాక, రాజులకు
ఆవశ్యకమైన విద్యయనియును గ్రహింపవలసి యున్నది. మనుష్యులను
పరిపాలించుట యొక కళ అన్ని కళల కంటె పరిపాలన కళ చాల
కష్టము. ఆందోళనకారు లెప్పుడును పరిపాలకులు కాఁజాలరు.
(Agitators cannever be the ruler) విప్లవము వచ్చినప్పుడు అదివఱకున్న
శాసనములను భంగ మొనర్చుట యొక పెద్దపనిగా కన్పడును. అట్టి

వాఁడు రాజ్యపరిపాలనము చేయ మొదలుపెట్టినచో, ఆతని యనుచరులే తమ స్వార్థమునకై ప్రభుత్వ శాసనములను ఉల్లంఘించుచుందురు. వారిపై ఆధారపడిన యా నాయకుఁడును తన పదవీ స్వార్థమునకై వారిని శిక్షింప వెఱచును. అంతటితో సామాన్య ప్రజలకు కూడ ధర్మమునందు విశ్వాసము సన్నగిల్లును. యథేచ్ఛాచరణము ప్రబలును. అప్పుడెవ్వరికిని సుఖముండదు కాఁబట్టి పరిపాలకుఁడు స్వార్థపరుడు కాఁకూడదు; తానే శాశ్వతముగా ప్రభువుగా నుండవలెనని యనుకొనఁగూడదు పురూరవుడు చక్రవర్తియై యొకనాఁడు "నేను నా ప్రజలవంటి వాఁడనే కదా! ఇంత యధికారము నాకెందుకు! ఇది యెట్లు కలిగినది!" అని విచారపడినాఁడు; "ఈ రాజ్యము నా కక్కఱ లేదు, మానివేయుటకు మార్గమున్నచో చెప్పు" మని నారదమహర్షి నడిగినాఁడు. అప్పుడు నారదమహర్షి ఆ చక్రవర్తి మనస్సు పరమార్థోపదేశమునకు తగినట్లుగా పరిణతి నొందెనని గ్రహించి, 'నీవే పరిపాలించుటకు నిజముగా అర్హుడవు' అని పలికి యతనికి ఆత్మతత్త్వము నుపదేశించి రాజ్యపాలనమందు నిలిపెను. కాఁబట్టి స్వార్థము లేనివాఁడే చక్కఁగా పాలింపఁగలడు. స్వార్థపరుని రాజ్యనిర్వహణము కాసుకృత్యమే యగును గాని పరిపాలనము కాదు. అధికారములోనికి వచ్చిన ప్రతివాఁడును, దీనికి నేను తగుదునా అని విచారించుకోవలె. నేను ఇందులకు తగుదునని ఆత్మవిశ్వాసము యథార్థముగా కలిగిచో లోకక్షేమదృష్టితో ప్రాత శాసనములను తొలగించుటకుఁగాని ధర్మబద్ధములైన క్రొత్త శాసనములను చేసి అమలుపరచుటకుఁగాని వానికి శక్తి కలుగును "దేశమును పాలించుట కన్న చేపలఁబట్టుకొని బ్రతుకుచుండుట చాల మేలు" అని మూరత్ అను ఫ్రెంచి వాఁడొకఁడు చెప్పినమాట గమనింపఁదగియున్నది (It is far better to be a fisher man than to rule a country — Murat) పాలకునకు ఉండవలసిన గుణములు లేకుండ (పశేషం)

ఒకానొకఁడు పాలకుఁడగుట ఆ దేశ ప్రజల దౌర్భాగ్యమే. (one to be a master without master-virtues is the misfortune of the people) బందిపోటుదొంగలుకూడ గ్రామములను దోఁచి దోఁచి తుదకు రాజ్యములను సంపాదించుటయు మనము చరిత్రలో చదివి యున్నాము, పాలించుటకు వారికేమి యర్హత యుండును? ప్రజలకు దేనివలన హితము కలుగునో వారికెట్లు తెలియును! పాలకులైనంత మాత్రమున వారు దొంగలు కాక ఏమగుదురు! ప్రజలకు ఏది హితమో వేదాంత విచారణ చేసిన వానికి తెలిసినట్లు ఇతరునకు తెలియదు. వేదాంత విచారణలో, "నీ వెవఁడవు, నేనెవఁడను" అను ప్రశ్నలే కాదు, "ఈ జగత్తుయొక్క స్వరూపమేమి? ఈ జీవిత వ్యవహారమున సుఖదుఃఖము లెట్లు కలుగుచున్నవి?" అను విషయములు కూడ ఆలోచింపఁబడును. జీవిత వ్యవహారమున కూడ నిజముగా వేదాంత విచారణ వలె సుఖమును కలిగించునది మఱియొకటి లేదు. పరిపాలకుఁడు తత్త్వజ్ఞుఁడైనప్పుడే ప్రభుత్వ స్వరూపమును ప్రయోజనమును చక్కఁగా గుర్తింపఁగలఁడు. ప్రభుత్వ మొక సాధనము మాత్రమే. దాని కదియే లక్ష్యము కాదు, అది ఒక జాతియొక్క ధర్మము చక్కఁగా అనుష్ఠింపఁబడుటకై కావింపఁబడు నేర్పాటు మాత్రమే యగును (State is not an end in itself. It is only an arrangement of to cary out the Dharma of a particular set of people) ప్రభుత్వము ఒక శరీరము వంటిది. (body politic) శరీరము యొక్క అవయవములు ఊర్ధ్వముఖముగా అధోముఖముగా నెట్లున్నవో అట్లే ప్రభుత్వము యొక్క అవయవములను కూడ వర్తింపవలయును. తలతో చేయుపని ఆలోచనమును తల, కాలుతో చేయవలసిన పనిని— నడకను అలోచనమును కాలు, చేయి చేయవలసినపనిని— ఇచ్చుట. తీసికొనుట చేయు, ఎట్లు చేయు

చున్నవో, అట్టి ప్రభుత్వములో అందఱు తమ తమ పనులను చేయుచుండవలయును.

ఆస్తి అను మాట ఆక్రమణముతో (occupation) ఆరంభమైనదని, దానితో హక్కులు వానిని రక్షించుటకై రాజ్యము state ఏర్పడినదని చెప్పుదురు. మనుష్యునిలో "నేను, నాది" భావములు ఎప్పుడు వ్యక్తమయ్యెనో అప్పుడే ఆస్తులు, హక్కులు ఏర్పడిన వన్నమాట చిన్న పిల్లవాఁడుకూడ, తన చేతికందిన వస్తువును 'నాది' అని చెప్పి వదలకుండ పట్టుకొనును. మఱి ప్రభుత్వము మనుష్యుల కొఱకా లేక ఆస్తుల కొఱకా? ఆస్తుల కొఱకే. వారు లేకున్నచో ప్రభుత్వ మెక్కడిది? మనుష్యులు మనుష్యత్వమునుండి పశుత్వములో పడకుండ, మనుగడను సాగించుకొనుటకే ప్రభుత్వ మేర్పడినది. అనగా ఎవరి ధర్మమును వారు పాటించునట్లు ప్రభుత్వము శాసింపవలెను. అట్టి శాసనము చేయుటకు అహంకారపరులు, కామక్రోధపరాయణులు పనికిరారు. అనఁగా తత్త్వదర్శనము లేనివారు, ఆత్మనిగ్రహము లేనివారు శాసనములు చేయరాదు. ఎవఁడు శాసనము వలన లాభము పొందునో అట్టివాఁడును శాసనము చేయరాదు. ధర్మశాస్త్రమును రచించుట మహర్షులకే సాధ్యము. సాధారణ మానవులు, ఎంత మేధావంతులైనను ధర్మమును యథాతథముగ గుర్తింప లేరు. అధిక సంఖ్యాకులు చెప్పినదంతయు (opinion of Mejority) సమంజసమై యుండునని చెప్పలేము. మఱి ఈ నాఁడు మహర్షు లెక్కడ నుండి వత్తురు? ఈ కాలమున ఋషులు పుట్టుటకు తగిన పరిస్థితులు (Atmosphere or soil) లేవని ఆపస్తంబుఁడు చెప్పినాఁడు. క్షేత్రములను, బీజములను, అనఁగా భార్యాభర్తలను వైదిక సంస్కారములతో బాగుచేసుకొనవలయును. అప్పుడు తేజస్వియైన సంతానము కలుగును. వసిష్ఠుఁడు ఆకాశగమనమున వచ్చి శ్రీరామునకు తత్త్వము చెప్పెడివాఁడట. అట్టి యోగసిద్ధులు కలవారికి అతీం

ప్రియమునైన ధర్మరహస్యములు కరతలామలకములై యుండును. కావున ప్రతివాఁడు తానున్న స్థితి నుండి పైస్థితికి పోవుటకై తగిన ధర్మము ననుష్ఠించుటకు అనువైన పరిస్థితులను ప్రభుత్వ మేర్పరచ వలయును.

రాజ్యము ధర్మార్థ కామమోక్షములకు రాజమార్గముల నేర్పఱచునదిగా నుండ వలయును. ధర్మము తప్పిన వారిని శిక్షింప వలయును. పశుత్వమునకు సన్నిహితులై సుఖలాలసులైన మానవులు చోదనము, దండభయమును లేకున్నచో యథేచ్ఛా విహారముల వైపునకే మొగ్గుదురు కాని ధర్మము నవలంబించుటకు పూనుకొనరు. ప్రతివాఁడును పుణ్యము యొక్క ఫలమును కోరునే కాని, పుణ్య కార్యమును చేయఁగోరడు; అట్లే పాపఫలమును కోరఁడు గాని పాప కార్యమును మాత్రము కోరును.

శ్లో॥ పుణ్యస్య ఫల మిచ్ఛన్తి, పుణ్యం నేచ్ఛన్తి మానవాః।
ఫలం పాపస్య నేచ్ఛన్తి, పాప మిచ్ఛన్తి మానవాః॥ వ్యాసః

మనుష్యులు అర్థకామములను కోరుదురే కాని, వానికి సాధనమైన ధర్మమును మాత్రము కోరరు. కావుననే వ్యాస భగవానుఁడు "ధర్మము వలన అర్థము, కామము సిద్ధించును. అట్టి ధర్మమును మీరేల సేవింపరని చేతులు పైకెత్తి ఘోషించుచున్నాను; కాని ఒక్కఁడును నా మాట వినుటలేదు" అని భారతములో చెప్పినాఁడు. కావున ప్రభుత్వమునకు పరమ ప్రయోజనము ధర్మరక్షణమే. స్వర్గ మోక్షములు పుణ్యపాపములు అను సంగతియే లేక కేవలము పశు ధర్మములైన ఆహార నిద్రా భయ మైథునములు నిరాటంకముగా సాగుటకై చేసుకొను నేర్పాటు ఎంత గొప్పదైనను 'రాజ్యము' అను పేరునకు తగదు. ఇహమందును పరమందు ఎల్లరకును ఏది సుఖమును కలిగింపఁ గలదో అట్టిధర్మమును ప్రజలు ఆచరించునట్లు ప్రభుత్వము

(state) చేయవలయును. తద్భిన్నమైనది ప్రభుత్వము కాదు.

## ౪. ఆపద్ధర్మము

ప్రభుత్వము ధర్మమును రక్షింపనప్పుడు, రాజ్యములో విప్లవము వచ్చినప్పుడు ప్రజలేమి చేయవలయును? అది ఆపద కావున అప్పుడు ఆపద్ధర్మమును పాటింపవలయును. స్వధర్మము నాచరించుచు బ్రతుకలేని పరిస్థితి కలుగుటయే ఆపద. ఇట్టి యాపదలు అప్పుడప్పుడు తటస్థించుచునే యుండును. 'నేను ధర్మమును ఏ పరిస్థితియందైనను వదలను' అని దృఢముగా పూనినవాఁడు, అనగా ధర్మవీరుఁడు ధర్మమును వీడక, అందులకు ప్రతికూలముగా సమాజముగాని ప్రభుత్వమే గాని విధించు శిక్షలను సైతము అనుభవించుటకు సిద్ధముగనే యుండును, అందఱును అంత సాహసము చేయలేకపోయినను, ప్రాణాపాయ సమయమున ప్రాణరక్షణకై స్వధర్మమును వీడి అన్యధర్మమును అవలంబించినను ఆపద తీరినంతనే మరల స్వధర్మమును ననుష్ఠింపవచ్చును. ఆపదయందు అవలంబించు నన్యధర్మమునకే ఆపద్ధర్మమని పేరు. ఇది చాల సూక్ష్మమైనది. ఒక బ్రాహ్మణుఁడు ఆకలివలన చచ్చుటకు సిద్ధముగా నుండి ఒక మాలవాని నడిగి వండిన యులవలు తీసికొని తినినాఁడు. తరువాత మంచినీరు ఈయఁగా ఆ బ్రాహ్మణుఁడు "ఆహారము వలననే నా యాపద తీరినది కావున ఇంక నీవలన నీరును గైకొన"నని వెడలి పోయినాఁడు. ఆపదలో అనాచారమునకు పాల్పడినను తరువాత ప్రాయశ్చిత్తముచే శుద్ధి నొందవచ్చును అనాచారమునకు అలవాటు పడరాదు. ఎంతవారికైనను ఆపదలు కలుగవచ్చును విశ్వామిత్రుఁడంతటివాఁడు మహాక్షామము వచ్చినప్పుడు ఆపద్ధర్మముగా కుక్కమాంసమును తినదలఁచి దానితో వైశ్వదేవమును చేయుటకు ప్రారంభింపఁగా దేవతలు జడిసి వర్షమును కురిపించినారఁట. ఆపదయందు అనాచారమునకు పాల్పడినను ఆపద పోయిన తరువాత ప్రాయశ్చిత్తము చేసికొని యథాపూర్వముగా ధర్మము లాచరింపవలెననుట శాస్త్రాభిప్రాయము,

ఆ యీ యాపద్ధర్మములు స్వధర్మమును సమూలముగా ఛేదించునవిగా నుండరాదు. అనఁగా ప్రాణాపాయము వచ్చినప్పుడు ప్రాణము నిల్పుకొని తిరిగి స్వధర్మమును అవలంబించుటకు అవకాశమును కలిగించుటకు ఏర్పడినవియే ఆపద్ధర్మములు. ఇంతవరకే ఆపద్ధర్మము. అట్లుగాక స్వధర్మమును పూర్తిగా శాశ్వతముగా నాశనము చేయునవి ఆపద్ధర్మములు కావు. శరీరమును నిలుపుకొన్నను తరువాత స్వధర్మమును అవలంబించుటకు అవకాశమే లేనప్పుడు కేవలము శరీరమును రక్షించుకొనుటకై అన్యధర్మమును అవలంబింపరాదు. అట్టి పరిస్థితులలో స్వధర్మమును వీడక శరీరము వదలుటయే మేలు. అంతేకాని యీ యుపాధిని నిలుపుకొనుటకై ధర్మమునుండి పతనము నొందరాదు. ధర్మముకొఱకై దృఢనిశ్చయముతో శరీరమును వదలినచో దివ్యోపాధితో కూడిన జన్మము వచ్చును.

అరాజక పరిస్థితులలో కేవలము ధర్మరక్షణము నుద్దేశించి యొక వర్ణమువారు మఱియొక వర్ణము వారియొక్క ధర్మముల నవలంబించుటయు ఆపద్ధర్మమే. కాశీలోని మఠములను అఖాడాలందురు. గంగాతీరమందున్న యీ మఠములలో స్వధర్మనిష్ఠులై యనేకులు చేరి తత్త్వచింతనపరులై యుందురు. వానికి మంచి రాబడియు కలదు. ఒకప్పుడు ఆ మఠములలో నున్నవారిని తురుష్కులు హింసింప జొచ్చిరి. అప్పటి రాజపుత్ర సైనికులు అదంతయు కనిపెట్టుచుండిరి. వారును శాస్త్రపాఠములు వినుచు నిజమైన శాస్త్రవిశ్వాసము కలిగి యుండిరి. అప్పుడు వారు తాము కూడ మఠాధిపతులుగా ఉండకపోయిన యెడల ఆ మఠమును రక్షించుకొనుట కవకాశము లేదని తెలిసికొని, అప్పటి ప్రభువుల వలన అట్టి యధికారమును పొంది, వారును మఠాధిపతులై వానిని రక్షింపఁ జొచ్చిరి. కావుననే యిప్పటికిని కాశీలో వేదశాస్త్రములు చక్కఁగా ప్రచార మందుండఁ గలిగెను. మన కెప్పటికప్పుడు ఏర్పరచుకొనఁ గలిగిన ఆపద్ధర్మమునకు ఇది మంచి యుదాహరణము. ఆపత్కాలములందు ఇట్టి యాపద్ధర్మ

ములను అవలంబింపకున్నచో అరాజకము వలన దేశము సర్వనాశ
నము కాఁగలదు అరాజక కాలమందు లోకమెంత భీభత్సముగ
నుండునో శ్రీమద్రామాయణమున దశరథమరణానంతరము జరిగిన
మహాత్ముల సంవాదమునందు ఒక సర్గయంతయు వర్ణింపఁ బడినది.
ఆవర్ణనము చూచినపుడు దశరథుని పరిపాలనమున రాజ్యము ఎట్టి
సంపదలతో తులఁదూగు చుండెనో తెలిసికొనఁ గలము. రాజ్య
మనఁగా అట్టి సంపదలు కలిగినదే కదా! అవి లేకపోయిన తరువాత
నామమాత్రముగా ఏదోయొక రాజ్యమున్నచో నేమి ప్రయోజనము?
దేశము ఐదవతనము లేని స్త్రీవలె అఘోరించుచుండును.

కలియుగమున 4,32000 సంవత్సరములలో ఇప్పటికి అయిదు
వేలకు పైగా మాత్రమే గడిచినవి ఐనప్పటికి కలియుగాంతమున
రాఁగల బీభత్సమైన యధర్మ ప్రవృత్తి అన్ని విషయములలోను
కనఁబడుచునే యున్నది. కాని ధర్మము మహనీయ మను తలంపు
(Concept) మనలో ఇంకను ఉన్నది గనుక హత్యలు మొదలగువానిని
మనము చేయుట లేదు, అంతేకాని మనము పిరికి పందలము కాము.
ఈ విషయమును మనము కొంచెము సూక్ష్మముగా విచారించు
కొనినఁగాని తెలియదు, పూర్వమున్న హిందువులు దాడిచేసిన
మహమ్మదీయులతో కలియఁగా అట్లు కలిసినవారి సంతతియే
యిప్పటి మహమ్మదీయులు. కాబట్టి ప్రాణభీతికి జడిసి అన్యమతస్థు
లలో కలిసినవారి సంతతికంటె, జడియక నిలువ ద్రొక్కుకొన్నవారి
సంతతియైన మనము ఎప్పటికిని పిరికివాండ్రము కాము. అందువలననే
మన సర్వ శాస్త్రముల యందును ధర్మరక్షణార్థమై ఈ క్షణభంగుర
మైన కాయమును బలి యీయవలయుననియే చెప్పఁబడి యున్నది
కాని, ఈ తుచ్ఛమైన కాయము కొఱకు ధర్మమును వదలుకొమ్మని
యెచ్చటను చెప్పఁబడలేదు "కాయములు క్షణ భంగురములు
కావున రణమున మరణించుటకు చింత యేఁదులకు!"

శ్లో॥ క్షణ విధ్వంసినః కాయాః కాచిన్తా మరణే రణే॥
(హితోపదేశము, సుహృద్భేదము – శ్లో. 188)

అయినను, "మొదటి ధర్మ సాధనము శరీరమే" యనియు చెప్పఁబడి యున్నది. ("శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" కుమార సంభవము– 5వ సర్గ– శ్లో 33) కావున రాష్ట్రభంగే ప్రవాసేవా" అని మొదలుగా పరాశరస్మృతిలో (అధ్య 7 శ్లో 36, 37, 38) చెప్పబడిన యాపదలలో ఆపద్ధర్మమును అవలంబించి శరీరరక్షణము చేసి కొని క్రమముగా స్వధర్మమున ప్రవేశింపవలయును. ధర్మము కొఱకై శరీరమును వదలిపెట్టుట కూడ ఆపద్ధర్మమే. చావు అన్నచో అందరకును భయము కలదు. కాని దానికి సిద్ధపడు వారందఱును ధీరులు కారు. స్వార్థమునకై ఉద్రేకపూరితులై ముందు వెనుకలు తెలియక పశువులవలె మీఁదబడి తాను చచ్చుటో పరుఁడు చచ్చుటో తెలియని యపస్మారస్థితిని ధైర్యముగా కొనుట పొరపాటు. అది పశుస్థితి. ధర్మరక్షణకై పోరాడుచున్నాను నిశ్చయముతో, ఎంతమంది శత్రువులు వచ్చి మీఁదబడినను వెనుకంజ వేయక యుద్ధమునందు మరణించు వాఁడు మహాధీరుఁడు. వాఁడే సూర్యమండలమును భేదించి, యోగియైన పరివ్రాజకునితో సమానముగ, ఉత్తమ లోకములకు పోవును.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ।
పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః॥
(పరాశర స్మృతి అధ్యా – 3 – శ్లో – 31)

ఇట్టి ధీరునకు "ఈ శరీరము నశించుచున్నదే కాని నేను నశించుట లేదు" అని దృఢమైన జ్ఞానముండును. స్వార్థము భంగపడి నప్పుడు క్రోధావిష్టుఁడై యొడలు తెలియక యితరులను చంపుచు తాను చచ్చువానికి ఇట్టి జ్ఞానముండదు. ఉత్తమలోక ప్రాప్తియు నుండదు. క్రోధము దుర్గతికి రాచబాట. కావుననే శ్రీకృష్ణభగవానుఁడు

"ఈలోకమున శరీరమును వదలుటకు ముందే ఎవఁడు కామక్రోధ
ముల వేగమును సహింపఁగలిగి యున్నాఁడో వాఁడే యోగి, వాఁడే
సుఖి" అని యర్జునునకు బోధించెను.

శ్లో॥ శక్నోతీ హైవయస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామ క్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥ 5—23

కావున కామక్రోధ వేగమునకు లోఁబడి చావునకు సిద్ధపడుట మహా
పాపము. ధర్మమును గుర్తించి యుండులక్కై ధైర్యముతో పోరాడుచు
శరీరమును వదలుటక్కైన సిద్ధపడినచో అది త్యాగమగును.

ధర్మసందేహము కలిగినప్పుడేమి చేయవలె? పెద్దల వలన
శాస్త్రములవలన కర్తవ్యమును నిశ్చయించుకొనవలె. సూత సంహి
తలో ఇట్లు చెప్పఁబడి యున్నది. "ప్రభుత్వము కాక, ధర్మాధర్మ
ములకు ఫలము నొసంగు పరమేశ్వరుఁడొకఁడున్నాఁడని దృఢముగ
విశ్వసింపవలెను. ఆపరమేశ్వరుని యాజ్ఞా రూపమైన వేదమునే
పరమ ప్రమాణముగా భావించి అందు చెప్పఁబడిన ధర్మములను
ఆచరింపవలె. ఆపత్సమయములలో ఆస్తిక్యము గలవారు గదా
(Theists) అనుకొని క్రైస్తవాది అన్యమతములవారిని ఆశ్రయించుట
కన్న బౌద్ధుల నాశ్రయించుటయే మేలు. ధర్మమార్గమున అర్థింప
గలిగిన ధనమే "అర్థ" మను పురుషార్థమగును గాని అక్రమార్జితము
పురుషార్థము కానేరదు. అట్టి ధనసంపాదనము గావించువాడు పురు
షార్థములకు దూరుఁడై సమూలముగా నశించును."

## 4. శబ్దమునకు ప్రమాణము

ధర్మమునకుఁగాని తత్త్వమునకుఁ గాని వేదమునే పరమ ప్రమా
ణముగా ఏల భావింపవలె? అసలు ప్రమాణ మనఁగా ఏమి? "తమ
తమ విషయములందు అన్ని ప్రమాణములు శూరులవలె వర్తిం
చును" (స్వవిషయ శూరాణిహి ప్రమాణాని) అని శంకరులవారు
చెప్పి యున్నారు.

ఏమాట ఏయర్థమును తెలియఁజేయునో ఆ యర్థమునకు ఆమాట ప్రమాణము. యజ్ఞమువలన స్వర్గము కలుగునని వేదము చెప్పియున్నది. యజ్ఞస్వరూపముగాని దానివలన కలుగు స్వర్గస్వరూపము గాని మన బుద్ధికి గోచరించునవిగావు. వాని స్వరూపమును, వాని సంబంధమును మనము వేదమువలననే గ్రహింపవలసియున్నది. ఇతర గ్రంథముల వలన తెలియదు. కావున యజ్ఞలక్షణమును స్వర్గస్వరూపమును తెలిసికొనుటకు వేదమే ప్రమాణము. ఇట్లే ధర్మము, దాని నాచరించుటవలన కలుగు ఫలము, ఆత్మజ్ఞానము, దాని వలన కలుగు మోక్షము అను విషయములనుగూడ మనము వేదము వలననే గ్రహింపవలసియున్నది. లోక వ్యవహారముకూడ శబ్దప్రమాణము పైననే జరుగుచున్నది. రోగము వచ్చిన వానికి, ఆ రోగము యొక్క స్వరూపమును, దానికి తగిన చికిత్సను తెలిసికొనుటకు ఏది ప్రమాణము? ఆ రోగమును గూర్చి చికిత్సను గూర్చి బోధించునట్టి వైద్యశాస్త్రము, ఆ శాస్త్రము ననుసరించి చికిత్స చేయు వైద్యుని వాక్యమే కదా ప్రమాణము. శాస్త్ర విషయములే కాదు, దైనందిన వ్యవహారములు కూడ శబ్ద ప్రమాణము వలననే జరుగుచున్నవి "అక్కడ మామిడిపండ్లు ఊరక యిచ్చుచున్నారు" అని యెవఁడైన నొకఁడన్నచో, వానియందలి నమ్మకముతో ఆ మాటనుబట్టి అందరును అక్కడికి పరువెత్తుదురు. ఇక్కడ ఆతఁడనుటయే కదా ప్రమాణము. పొగడుట, తెగడుట రెండును మాటలే. పొగడ్తకల మాటలతో పొంగుచు, తెగడుటకల మాటలతోఁ గ్రుంగుచున్నాము. చెడ్డ మాటలతో చెడిపోవుట మంచి మాటలతో బాగుపడుటయు జరుగుచున్నది. కావున శబ్దమును చక్కఁగా నుపయోగింపవలె. చావును గూర్చి భయపడుచున్న వానికి, "నీవు చచ్చువాఁడవుకావు, నిత్యసత్యానంద స్వరూపుఁడవు" అని చెప్పినచో వాఁడు వెంటనే, "నేను

ఖావలసింది కొట్టుకొనుటయా? నేను సచ్చిదానంద స్వరూపుడనని ఎట్లు తెలుసు? చెప్పుము" అని వెంటబడును గాని శ్రుతిశబ్దమే ప్రమాణము.

ఇట్లు ఆలోచింప మొదలిడినచో శాస్త్రములోని విషయములను యుక్తులనకూడ కొంతవరకు గ్రహింపవచ్చును. కాని కేవలం యుక్తి చేతనే గ్రహింపదగుననుటకు వీలు లేదు. యుక్తి అనగా నేమి? "యుజ" అను ధాతువునకు కలుపుట యని యర్థము. దేనివలన ఏది సంభవించుచున్నదో పరిశీలించుచు, ఇది కారణముగా ఆకార్యము సంభవించినదని ఆ రెండింటికి సంబంధము నిరూపించుట యుక్తి. నిష్కామమైన నిత్యకర్మానుష్ఠానము కారణముగా చిత్తశుద్ధి యను కార్యము కలుగునని శాస్త్రము చెప్పుచున్నది. ఇప్పుడు అనుభవము వలనను గలదు. నిత్యకర్మలను శ్రద్ధతో అనుష్ఠించు వారియందు చిత్తశుద్ధి, ప్రశాంతి మనలో కన్న అధికముగా కనిపించుచున్నది. మనము కూడ మన మాచరించు కర్మానుష్ఠానము వలన కొంత చిత్తశుద్ధియొక్క అనుభవమును ప్రశాంతియును గలుగుచునే యున్నవి. అనగా ఈయనుభవమును తెలిసినచో ఎవడైనను ఎంత కాలమైనని కర్మానుష్ఠానమును కొనసాగించును. శాస్త్రప్రతిపాదిత ధర్మానుష్ఠానమునకు ఫలమైన యనుభవము ఎంతో కొంత ప్రత్యక్షముండును. కాని యే యొక్కనికి శాస్త్రములో చెప్పిన సకల ధర్మములయొక్క సకల ఫలములయొక్క అనుభవము గాని జ్ఞానముగాని యుండుట అసంభవము. జగత్తుయొక్క సకల ధర్మములను, తత్త్వములను సమగ్రముగా నెరుగువాడు పరమేశ్వరుడొక్కడే. ఆ పరమేశ్వరుని వాక్యమైన శాస్త్రమే ప్రమాణము. దానికి మరియొక ప్రమాణము లేదు. మనకు తోచిన యుక్తులతో దానిని గ్రహించుటకు ప్రయత్నింపవలెనే గాని కేవలము యుక్తిపై ఆధారపడి ధర్మములను గాని తత్త్వములను గాని గ్రహించుటకు వీలు లేదు. శాస్త్రములలో (Science)

అన్వయ వ్యతిరేకముల చేత పదార్థముల సంగతి విచారించుచున్నారు. ఏదియున్నచో మరొకటి యేది యుండునో, ఆ రెండింటి సంబంధమును అన్వయ మందురు. యేది లేకపోయినచో మరొకటి యేది యుండదో, ఆ రెండింటి సంబంధము వ్యతిరేకమందురు. ఉదజని ఆమ్లజని కొన్ని పాళ్ళలో కలిసినప్పుడు జలము సంభవించును (Water)=$H_2O$ ) అని శాస్త్రజ్ఞుడు చెప్పినప్పుడు, అన్ని కాలములలో ఎల్ల పరిస్థితులలో జలమిట్లేయొప్పుడునని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. అన్ని కాలములలో ఎల్ల పరిస్థితులలో ఈ వాయువుల సమ్మేళనము యెట్లు జరుగునో, వాని వలన యేవేవి సంభవించునో తెలిసికొనుటకు మనుష్యుడు అన్ని కాలములలో అన్ని పరిస్థితులలో ఉండుటయే సంభవము కాదు. అత్యధికమయిన యుష్ణోగ్రతలో (High Temparature) ఉదజని ఆమ్లజని కలియవు. అవి ఒకయుష్ణోగ్రతలో, కలిసి మరొక యుష్ణోగ్రతలో కలియక పోయినచో, ఎల్లప్పుడు అటులే జరుగునని నిశ్చయించుటకు వీలు లేదు. కొన్ని పరిస్థితులలో ఇందులకు భిన్నముగా, జరుగవచ్చును. అన్ని వాతావరణ పరిస్థితులను (Climates) అన్ని యుష్ణోగ్రతలను తెలిసికొనిన వాడు మాత్రమే దానిని నిశ్చయింపగలడు. సృష్టివైచిత్ర్యము, కాలమును అనంతములు మరి శాస్త్రజ్ఞుని యాయుర్దాయము, బుద్ధిశక్తియును పరిమితములు, కాబట్టి శాస్త్రజ్ఞుడు దెప్పునును, నాకు తెలిసినంతవరకు చెప్పుచున్నాను' అనియే చెప్పుచుండవలెను. ప్రాచీన గ్రంథములలో చెప్పబడి, ఇప్పుడు మనకు గోచరింపని వానిని అసంభవములని చెప్పరాదు.' అభిచార హోమములు చేసినచో విపరీత శక్తులు పుట్టును అని చెప్పినప్పుడు అవియన్నియు మూఢవిశ్వాసములని, అసత్యములని పలుకుట అశాస్త్రీయము. తెలియనప్పుడు నాకు తెలియదని యంగీకరింపవలెను.

సర్వజ్ఞుఁడయిన పరమేశ్వరుఁడు సనాతనమయిన వేదములను మనకనుగ్రహించి యిచ్చినాఁడు. కావున మనము దానిని పరమ ప్రమాణముగా భావింపవలసినదే కాని మన యుక్తితో దానిని నిరాకరించుటకు ప్రయత్నింపరాదు. మనకుఁ గలయాయుధము 'తెలియలేదు అను కతియే వేదమే యుక్తి. ఈ కతితో ఈయుక్తితో మన యజ్ఞానము ఛేదించుకొనుచు పోయినచో వేద ప్రామాణ్యముకూడ సుభగముగనే తెలియును. ఎల్లవారికిని సహజముగా ఇష్టప్రాప్తి అనిష్టపరిహారములు అభీష్టములగుటవలన, ప్రత్యక్షము చేతఁగాని, అనుమాన ప్రమాణము చేతఁగాని తెలియఁబడని యిష్టముయొక్క ప్రాప్తికి, అనిష్టముయొక్క పరిహారమునకును ఉపాయములను ప్రకాశింపఁజేయుటయే ఈ వేదమునకంతకును తాత్పర్యము" (సర్వోప్యయం వేదః ప్రత్యక్షానుమానాభ్యా మనవగతేష్టా నిష్ట ప్రాప్తి పరిహారోపాయ ప్రకాశన పరః, సర్వపురుషాణాం నిసర్గత ఏవ తత్ప్రాప్తి పరిహారయో రిష్టాత్।, కాఁబట్టి మన యనుభవముచేత, ఊహచేత మనము గ్రహింపలేనివి, నిశ్చయింపలేనివి, అయినను మనకు అత్యంతము ఆవశ్యకమయినవి యగు నిష్టసాధనమునకు, అనిష్టపరిహారమునకు ఉపాయములను చెప్పునదియే వేదమని పై నిర్వచనమువలన యేర్పడుచుండఁగా, మనము యే ఇతర ప్రమాణములచేత ఆ వేదము చెప్పిన ధర్మతత్త్వ విషయములలో ఖండన మండనములు చేయఁగలము? వస్తుతత్త్వమును తెలిసికొనుటలో పరమోదాత్తమైన యాలోచనమే (Highest thinking) సర్వజ్ఞుఁడయిన పరమేశ్వరుని వాక్యము కావున వేదవిహితములయిన వర్ణాశ్రమాది ధర్మములను ప్రమాణబుద్ధితో గ్రహింపవలసినదే కాని మన తర్కములచేత నిరాకరింపరాదు. అనుకూలములయిన యుక్తులమూలమున అర్థము చేసికొనుటకు ప్రయత్నింపవలెను.

## 4. శబ్దము - ప్రమాణము

ఉదాహరణమునకు వర్ణములను గ్రహింపుడు. వర్ణములు కలవనుటకు 'వర్ణము' అను శబ్దమే ప్రమాణము. దేవునకు 'దేవుఁ' డను శబ్దమే ప్రమాణము. పుట్టినది మొదలు చచ్చు వఱకు ఉండునట్టి తండ్రి, కొడుకు మొదలగు శబ్దములు కాని, పుట్టుటకు పూర్వము చచ్చిన తరువాత ఉండునట్టి స్వర్గము, మోక్షము మొదలగు పదములను గాని ఎవఁడును సృజింపలేదు. శబ్దజాలము మొదటి నుండియు ఉన్నది. ఈ పదజాలములో పుట్టుచున్నాము. పదము అనగా అర్థము కలిగిన ధ్వని. ఈ వస్తువునకు ఈపదము ఎందుకు వేరైనది అని యడిగినచో ఎవరును చెప్పలేరు. అది ఈశ్వరసంకల్పమని పూర్వులన్నారు. ఈ శబ్దమునకు ఈ యర్థము ఉండవలెనని ఎవరో ఏర్పాటు (Conven-niot) చేసినారని కొందరు అందురు. ఇది సమంజసముకాదు. అట్టి యేర్పాటు జరుగుటకు కొందఱు సమావేశము (Meeting) కావలెను. అట్టి సమావేశము జరుపుటకు. 'స మా వే శ ము న కు రమ్ము' అను వాక్యము ఉండవలె, అందులో సమావేశము అను ప ద ము న కు అర్థము కూడ తెలిసియుండవలె ఆమాట, దాని కా యర్థము లేకున్నచో సమావేశ మెట్లు చేయుదురు ? కాఁబట్టి "ఏర్పాటు" చే తనమాటలకు అర్థములు సిద్ధముగుట అసంభవము. కోపము అనగా ఒక భావము (feeling) దానిని ఆంగ్లమున "anger" అని. తెలుఁగున కినుక అని అనేకవిధములుగా వ్యక్తము చేయుదురు. ఒక యర్థమునకు ఇన్ని మాటలెట్లు వచ్చినవి ? ఒక పదమునకు అనేకములైన యర్థములున్నవని యనుకొనుచున్నాము. కాని లేవు. కదలుట, ఆడుట. సంచరించుట మొదలగునవి ఒక్కొక్కమాట ఒక్కొక్క యర్థమునే చెప్పుచున్నవి. ఒకమాటకు యథార్థముగా పెక్కు అర్థము లుండవు అర్థమైనది, గ్రహించినాను అని మొదలైన తెలుఁగు మాటలకు గాని "Understand, Know, Realise, Perceive,

Conceive" అని మొదలైన యాంగ్ల పదములకు గాని యర్థము ఒకటికాదు. ఒక్కొక్క మాటకు వేలువేలుగా అర్థము లున్నవి. (Shades of meaning) ఒక పదముండినచో దానికి ప్రత్యేకమైన యర్థముండి తీరవలె. అయినను వస్తువులను బోధింపని, అర్థములులేని శబ్దములు కూడ కొన్ని యున్నవి కుందేటికొమ్ము, గగన కుసుమము మొదలగునవి యిట్టివి. ఇవి యసంబద్ధములైన పదముల కూర్పులు. (These are compound words of wrong combinations.

వర్ణ మనగా రంగు అని అందఱకు అర్థమగుచున్నది రంగు అనగా ఏమి? తెలుపు, నలుపు మొదలగునవి రంగులు. కంటికి కనబడునది రంగే. ఒక రంగునే పెక్కుచోట్ల చూచి, దానిని గూర్చియే ఆలోచించుచు ప్లేటో (Plato) తత్త్వజ్ఞుండైనాండట. ఒకరంగులోనే ఎన్నో భేదములు కలవు. నలుపురంగు వేఱు. నీలిరంగు వేఱు. ఏడురంగులున్న సంగతి మొదట సూర్యుని కాంతివలన గ్రహించియుందురు. మబ్బులు నీలచ్ఛాయ కలిగియున్నప్పుడే వర్షము కురియునని చెప్పుదుము. దయకు నీలమును సంకేతముగా చెప్పు దురు. ప్రసవించుటకు పూర్వము తల్లియొక్క స్తనాగ్రములు నీల వర్ణము నొందును. వర్ణము అను శబ్దమునకు వ్యుత్పత్తి యేమిటి? ఇందులకు పాణిని వ్యాకరణమే మనకు ఆధారము. ఒక్క సంస్కృత ములో మాత్రమే మాటలకు వ్యుత్పత్తి వఱకు (Root meaning) వెళ్లుదుము. "రమ్ - క్రీడించు" అను ధాతువునుండి "రమణః, రామః, రమ" మొదలుగా పెక్కు పదములు వచ్చినవి అట్లే 'వృ - వరించు' (choose) అను ధాతువునుండి వర్ణము అను పదము వచ్చినది. ఒకనికి ఒక వర్ణము వచ్చినదన్నచో, ఆజీవుడు వరించిన దానినిబట్టి. అనగా కోరుకొన్నదానిబట్టి. వాని కావర్ణము వచ్చిన దన్నమాట. వర్ణములు మానవులలోనే కాదు. చెట్లలోను, రాళ్లలోకూడ ఉన్నవి. వర్ణవిభాగములున్న దేశమును కర్మభూమి యన్నారు.

సృష్టిలో వర్ణము లున్నచో అన్నిచోట్ల ఎందుకు లేవు అని ప్రశ్నింతురు. సృష్టిలో నున్నది గదా అని ప్రతిది ప్రతిచోట నుండదు; ఉన్నను కొన్నిచోట్ల గుర్తింపఁ బడదు. వర్ణము లున్నవని గుర్తించి వానికి సంబంధించిన ధర్మకర్మములను నిర్వర్తించు చున్నారు గనుక మన దేశము కర్మభూమి యైనది. వర్ణవిభాగములేని యితర దేశములను భోగభూము లన్నారు.

### 5 ఐశ్వర్యము ధర్మాచరణమునకు ఫలము

ఈ లోకములో మహాదశ అనుభవింప వలయునని ప్రతి వారికీ వాంఛ యున్నది. నీ వేమి కోరినను అది నీకు లభించునని శాస్త్రము చెప్పుచున్నది. నీస్థితిని తెలిసికొని, అనఁగా నీ వర్ణమును, నీయాశ్రమమును గుర్తించి, ఆ స్థితిగా నీ కోరికలు తీరుటకు ఏ ధర్మములు ఆచరింపవలయునని శాస్త్రము చెప్పినదో వానిని నీవు ఆచరించినచో ఎన్ని భోగములనైన అనుభవించ వచ్చును. ఇప్పుడు చేసిన దానికి ఇప్పుడే యీ దేశముననే ఫలము లభించునని చెప్పుటకు వీలు లేదు. కొన్ని కార్యములు జన్మాంతరములలో దేశాంతరములలో ఫలింప వచ్చును. ఇక్కడ పుణ్యకర్మలు చేసినవారు కొందరు వాని ఫలము ననుభవించుటకై పాశ్చాత్య దేశములలో మహానుభావులుగా జన్మింప వచ్చు. వానియందు వైదిక ధర్మాచరణకు అవకాశము లేదు గనుక, అచట భోగానుభవమే ప్రధానము గనుక ఆ దేశములను భోగభూము లన్నారు. మనలో ఎన్నికోరికలు ఎంత గాఢముగ నున్నవో మనకే తెలియదు. కుచేలుఁడు తనకేమియు నక్కఱ లేదనుకొని, భార్యయు బిడ్డలును ఆఁకచాల్లుపడుచుండుట చూచుచుండియు ఊరుకొన్నాడు. చివరకు భార్య పోరుపడలేక శ్రీకృష్ణుని యొద్దకు వెళ్లియును ఆయునను యేమియు అడుగకయే తిరిగి వచ్చినాడు. కాని యింటికి వచ్చుసరికి తనకు మేడ, తనపేరులో పట్టణము మొదలుగా

ఎన్నియో భోగములు సంప్రాప్తమైనవి అప్పుడాయన తనకు ఈ యైశ్వర్యము రాకముందు ఉన్న భక్తియే అప్పుడు కూడ ఉండవలెనని శ్రీకృష్ణుని ప్రార్థించి పట్టణమున ప్రవేశించినాడు. తన మనస్సులో తనకు తెలియకుండగనే యింత యైశ్వర్యాభిలాష ఉన్నదని, శ్రీకృష్ణునకు తెలిసియే యిట్లు చేసినాడని, ఆయన తెలిసికొన్నాడట. కావున భోగాభిలాష ఎంత గాఢముగ నుండునో గమనింపుడు. ఎంత వైదిక కర్మనిష్ఠునకైనను ఎట్టి మ్లేచ్ఛదేశమందైనను, ఎట్టి నీచ సంసారములోనైనను ఏదో విధముగా సకల భోగములను అనుభవింప వలయునని యుండవచ్చును. భోగాభిలాష యుండుట తప్పు కాదు. వానిని సక్రమముగా అనుభవించిన తరువాతనే బుద్ధి పరిణతమై వైదిక ధర్మములను నిష్కామముగా ఆచరించుట సంభవించును. అదియే యీ సంసార విచ్ఛిత్తికి నాంది.

కర్మకాండ, భోగానుభవము కలిగించి క్రమముగా నిష్కామతను పుట్టించి వస్తుతత్వ విచారణకు తీసికొని వెళ్ళును. ప్రతివాడు నిత్యకర్మలను నియతముగా నిర్వర్తించుచు భక్తి నవలంబింపవలెను. దానివలన భోగానుభవముతో పాటు ముక్తికిని మార్గ మేర్పడును. ఇప్పు డెంత కష్టపడి ధర్మము నాచరించినను, యోగాదుల నవలంబించినను చచ్చిన మఱుక్షణమే సర్వము వ్యర్థమగునని సంశయింపరాదు. చావునకు భయపడరాదు. చచ్చిపోవునపుడు భౌతిక శరీరము మాత్రమే పడిపోవును గాని నీ యంతరంగమునకు భంగము లేదు. నీకు నాశము లేదు. సూక్ష్మశరీరముతో నీవు కర్మానుగుణముగా ఏ లోకములకైన పోవచ్చును. ఏ శరీరములనైన పొందవచ్చును. ఏ భోగములనైన అనుభవించ వచ్చును. ఈ సంగతులన్నియు బ్రహ్మసూత్రములలో స్పష్టముగా వివరింపబడి యున్నవి. ఉపనిషత్తులలోని తాత్పర్యమును నిశ్చయించుచు వ్యాసభగవానుడు సుమారు 5000 ఏండ్ల క్రిందట బ్రహ్మసూత్రములను రచించెను. సుమారు 2000

ఏండ్ల క్రిందట శ్రీ శంకర భగవత్పాదులవారు ఆ గ్రంథమునకు భాష్యమును వ్రాసినారు. వారికి పూర్వము కూడ ఆ సూత్రములను వ్యాఖ్యానించినవారు ఉన్నారు. సూత్రభాష్యమును చక్కగా చూచి నచో ఈ లోకమునందు గాని చనిపోయిన తరువాత పరలోకము లందు గాని ఎట్టి సౌఖ్యైశ్వర్యములను పొందవచ్చునో తెలియును. అసితుఁడైన దేవలుఁడు ఒక మహర్షి. ఆయన శ్రీకృష్ణుని గూర్చి చెప్పినట్లు కలదు. ఆ దేవలుఁడు గృహస్థాశ్రమములో నాల్గవ యాశ్రమమునకు చెందియున్నాఁడు. ప్రతి యాశ్రమములోను మరల నాలుగు ఆశ్రమములు, అనఁగా దశలు కలవు. ఆ మహర్షి యోగము చేత శక్తులు సంపాదించి ఆ కాశగమనాదులు చేసినాఁడు. ఆయనయే కాదు తపశ్శక్తిచే ఈ లోకమునందే మహాభోగముల ననుభవించిన మహర్షు లెందఱో కలరు. అట్టి వారికి భోగానుభవముచే విరక్తి కలిగి నట్లు ఇతరుల కెట్లు కలుగును?

## 6 దైవము — పౌరుషము

మహాపదవులను, మహాభోగములను, ప్రారబ్ధము వలన అనివార్యముగ సంభవించు మహాపదలను గూడ అనుభవించుచు, ఆ సుఖదుఃఖములను స్పష్టముగా చూడఁగలిగినప్పుడే ఆత్మ తత్త్వ విచారణ ఆరంభమగును. అప్పుడే దైవ మన నేమో, పౌరుష మన నేమో స్పష్టముగా తెలియును. ఆ వివేకము గలుగని వానికి ధర్మము నందు విశ్వాసము దృఢముగా నుండదు. శ్రీమద్రామాయణములో వర్ణింపఁబడిన శ్రీరాముని వైఖరి చూడుఁడు. ఆయన రాజ్యమును వదలి వనమునకు వెళ్లుచున్నప్పుడు ఎట్టి వికారమును పొందలేదు. పట్టాభిషేకము జరుగునన్నప్పుడు ఎట్లుండెనో ఆయన వనమునకు పొమ్మన్నప్పుడు కూడ అట్లే యుండెను. అనఁగా ఆయన ఆ సుఖ దుఃఖములతో తాదాత్మ్యమును పొందక, వానిని తన కన్న భిన్నముగా చూచుచు, వానివలన తానేమియు అగుటలేదని తెలిసి

కొనాలన్నదన్నమాట. ఈ సందర్భమున భాసుని నాటక రచన చాల బాగున్నది. 'రాజ్యము లేకపోయినచో పోనిండు, రాముని వనమున కేల పంపవలె'నని లక్ష్మణుడు చాల బాధపడుచుండగా, 'రాముఁ డెట్టి స్థితియుందును, తన రాముఁడే కదా లక్ష్మణుడు ఎందుకిట్లు కల్లోలపడుచున్నాఁడని సీత గలంచినట్లు కవి రచించినాడు.

ఆ సందర్భమున లక్ష్మణుడు దుఃఖపరవశుఁడై క్రోధము నొందఁగా, రాముఁ డతనిని శాంతింపఁజేసి దైవ పౌరుషముల స్వరూపమును గూర్చి బోధించినాఁడు. ఆత్మతత్త్వజ్ఞానము కలవాఁడు కావున నే రాముఁడు విచారపడక, రాజ్యముకంటె వనవాసమే మహోదయమని లక్ష్మణునకు బోధించినాఁడు. కైకపైగాని, దశరథునిపై గాని కోపించుట తప్పని, ప్రారబ్ధమును అనుభవింపక తప్పదని చెప్పినాఁడు. మనము అనుకొనకుండ, మనయూహకు (Calculation) అందకుండ ఆకస్మికముగా మనకు సుఖమునో దుఃఖమునో కలిగించునది ప్రారబ్ధము దీనినే దైవమందురు. దుఃఖములను కలిగించుదానిని దుర్దైవ మందురు. ఇది పూర్వకర్మకు ఫలము కావున అనివార్యము

తెలివి తక్కువవారు దైవముతో పోరాడుదురు. మఱి ప్రారబ్ధము ఇంత ప్రబలమైనచో ఇంక పౌరుషము వ్యర్థమేనా ? కాదు. దైవమును గూర్చి యింత గట్టిగా చెప్పిన రాముఁడు, సీతను రావణుఁడు అపహరించినప్పుడు, ప్రారబ్ధమును అనుభవింప వలసినదే యని చేతులు ముడుచుకొని కూర్చుండ లేదు. తీవ్రమైన పౌరుషము నవలంబించి ఎంతో శ్రమపడి రావణుని సంహరించి సీతను తీసుకొని వచ్చినాఁడు. ప్రారబ్ధము ప్రబలమైనంత మాత్రమున పౌరుషమునకు తావు లేకపోలేదు. ఏ సందర్భము నందైనను పౌరుషమును అనఁగా కర్తవ్యమును, నిర్ణయించునది ధర్మము. కైకేయి విషయమున రాముఁడు పౌరుషమును అవలంబించి విక్రమించుట అధర్మము. సీతాపహరణ సందర్భమున విక్రమింపకుండుట అధర్మము. ఈ సందర్భమున రాముఁడు అగస్త్యునితో, 'ఓ మునిశ్రేష్ఠా ! నేను క్షత్రియుండను. నా ధర్మను

రాక్షసుఁ డపహరింపఁగా ఊరకుందునా ?" అని చెప్పినాఁడు. [సూర్య గీత : "క్షత్రియోఽహం మునిశ్రేష్ఠ ! " ...]

ఇట్లు పౌరుషమునకు తావుకనిపెట్టి తగినట్లుగా ధర్మమును ఆచరించినఁగాని అభ్యుదయముగాని, మోక్షముగాని లభింపదు. పౌరుషమును చూపఁగలిగిన స్వతంత్రుఁడైన మహావ్యక్తిగాని యీ దైవ పౌరుషముల యథార్థ తత్త్వమును తెలిసికొనలేదు. తెలిసికొన్న మాత్రమునగూడ చాలదు. దానికితగిన ధర్మానుష్ఠానము కూడ కావలెను. ప్రారబ్ధముచేత రామునకు భార్య అపహరింపఁబడుట వాస్తవమే. కాని భార్యను శత్రువు ఎత్తుకొనిపోఁగా శుష్కవేదాంతమును చెప్పుకొనుచు విధవవలె ఊరక కూర్చుండుమని ప్రారబ్ధము చెప్పలేదు. పౌరుషముపూని, అసాధ్యములుగా తోఁచు విషయములలోకూడ, ధర్మమునవలంభించి ప్రయత్నము చేయవద్దని ఎక్కడ ఏ శాస్త్రము చెప్పలేదు. అట్టి సమయములందే మహాపురుషులలో నుండు పౌరుషమెట్టిదో వ్యక్తమగును. విభీషణుఁడు రావణాసురుని జయించుట కష్టమని చెప్పినప్పుడు, అట్టి రావణుని సపరివారముగా సంహరించి విభీషణునకు పట్టాభిషేకము చేయుదునని రాముఁడు మాట యిచ్చినాడు. మాట యిచ్చుటేకాదు. అప్పటికప్పుడే, యుద్ధము ప్రారంభింపకముందే, సముద్రమునుగూడ దాటకముందే, విభీషణునకు పట్టాభిషేకము చేసినాడు. ఇది యెంత ఆశ్చర్యకరము ! దైవమననేమో పౌరుషమననేమో గుర్తెరిగిన మహానుభావుల లక్షణమిది.

మహానుభావులైనను తాత్కాలికముగా దైవమునకు లోఁబడుట కామక్రోధ పరవశులగుటయు కలదు. పెద్దపెద్ద ఋషులు కూడ దైవముచేత పీడింపఁ బడినారు; వేలసంవత్సరములు తీవ్రములైన తపస్సులు చేసినను కామక్రోధములకు లోబడిపోయినారు. విశ్వామిత్రుఁడు వేయియేండ్లు తీవ్రమైన తపస్సు చేసినపిమ్మట కామమునకు లోఁబడినాఁడు. తత్ఫలితముగా శకుంతల పుట్టినది. కాని అట్టి మహాను

భావులు తాత్కాలికముగా కామక్రోధములకు లోఁబడి యున్నను, వెంటనే తమతప్పును తెలిసికొని పౌరుషమును పూని ధర్మము నవలంభించి యుత్తమస్థితి నందుకొన గలరు. సీతకొరకు వెదకి వేసారి ఎందును గానక రాముడు దుఃఖపరవశుడైనప్పుడు లక్ష్మణుఁడే రామునకు పౌరుషమును గూర్చి బోధించినాఁడు. ప్రయత్నముచేతగాని దేనిని సాధింపలేము. ఉత్సాహము మనకున్నది. ఇంతకంటె వేఱు బలము లేదు. సీతను సంపాదించి తీరుదును. ఉత్సాహమున్నవారు ప్రయత్నములో నష్టపడరు" అని లక్ష్మణుఁడు రామునకు చెప్పిన మాటలు మన మెల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనవలయును. "నీవు ఎవరవో స్మరింపుము. నీవు రాముఁడవు; మహాత్ముఁడవు; కృతాత్ముఁడవు నీ స్వరూపమును నీవు మరచుచున్నావు" అని లక్ష్మణుఁడు రామునకు స్మృతిని గలిగించినాఁడు. కాఁబట్టి చిత్తశుద్ధి కలిగిన మహామతికి అభ్యుదయమున కైన మోక్షమున కైనను ఉత్సాహము ఒక్కటి యున్న చాలును.

పౌరుషమునందు మహాపౌరుషము కూడ గలదు సంసారమునందు అధర్మము నెదిర్కొనుచు ధర్మము నాచరించుటకు మనమవలంబించు పూనిక సాధారణమైన పౌరుషము. రావణుఁడు పోయిన తరువాత అన్నకు ప్రేతకర్మలు చేయనని విభీషణుఁడు అన్నాఁడు. అట్లనుట అధర్మము. అప్పుడు రాముఁడు, "వైరములు మరణముతో ముగియవలసినవే; మన ప్రయోజనము తీరినది: మరణించిన యితనికి సంస్కారము చేయవలసినదే; ఇతడు "నీకెంతో (బంధువో) నాకునూ అంతే "(అనఁగా నీవు ఇతనికి సంస్కారము చేయకున్నచో నేనే చేయుదు నన్నమాట)

శ్లో॥ మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనం ।
క్రియతా మస్య సంస్కారో మమా ప్యేష యథా తవ ॥

అని చెప్పి విభీషణునిచేత తనకు శత్రువైన రావణునకు సంస్కారము చేయించినాఁడు ఆయనకు కర్మరహస్యము దాని ప్రాధాన్యము తెలియును. ఇట్లే ఆయన తన అత్యంత ప్రియురాలైన సీతను లంకనుండి తీసికొని వచ్చినప్పుడు. "నేను క్షత్రియుండను. గాన నాకు నా వంశమునకు కలిగిన యవమానము తీర్చుటకై రావణుని సంహరించినాను. నీకొఱకు కాదు. రాక్షసుని యింట సంవత్సర కాలముండిన నిన్ను నేను స్వీకరింపలేను. నేత్రాతురునకు దీపజ్వాల వలె నీవు నాకు తోఁచుచున్నావు. నీతో నాకు పనిలేదు. నీవు నీ యిచ్చవచ్చిన వారియొద్ద నుండవచ్చును" అని కఠినముగా సీతతో చెప్పి, ఆమె అగ్నిప్రవేశము చేయుదుననఁగా అంగీకరించినాఁడు. అగ్నిశుద్ధయైన ఆమెను స్వీకరించిన తరువాతకూడ మరల అయోధ్యలో జనాపవాదము బయలుదేరఁగా రాజధర్మమును పాటించి ఆమెను వదలినాఁడు. తాత్కాలికములైన యభిమానములు, స్నేహము, ప్రేమ మొదలగువానికన్న శాస్త్రవిహితమైన ధర్మము మిన్నయని, అన్ని పరిస్థితులలో దానినే పాటించుటకు ఆవశ్యకమైన పూనికయే పౌరుషము అసలీ సంసారమే వలదు అని దీనిని త్యజించుటకు కావలసిన సంకల్ప శక్తియే మహాపౌరుషము. ఊరక పురుషులుగా పుట్టుటవలన నేమి ప్రయోజనము ? మనకున్న పుంస్త్వము జంతువు లందును కలదు. నేను పురుషుఁడనని ఎవఁడు తలంచుచున్నాడో, వాడు ఇట్టి మహాపురుషత్వమును సాధించినప్పుడే వాని పురుషజన్మము సార్థకమగును.

## 7. శిక్షించుట అనఁగా నేమి ?

రాముఁడు పౌరుషశాలియై తాను ధర్మము నాచరించుటయే కాక ఇతరులను కూడ ధర్మమార్గమునకు మరలించినాఁడు. అధర్మ మార్గమందున్నవారిని శిక్షించినాఁడు. శిక్షించుట యనఁగా మంచి మార్గమునకు మరలించుటయే. ఎవరు ఎవరిని శిక్షించుచున్నారు ?

కుమారుని తండ్రి, తమ్ముళ్లను అన్న, శిష్యులను గురువు శిక్షించు చున్నాఁడు. ఎవఁడో యొకఁడు తప్పు చేసినచో ఎవనికి పట్టుచున్నది. తండ్రియో, అన్నయో, గురువో వాని విషయము పట్టించుకొని వానిని దండించి అపమార్గమునుండి మరలించుటకు ప్రయత్నింతురు. తక్కిన వారికి పట్టదు. తండ్రి కుమారుని తానుగానే చూచును. వాఁడు బాగున్నచో తాను బాగున్నట్లే తలంచును. అట్లే యితరులను కూడ పుత్రుల వలెనో, సోదరులవలెనో, శిష్యులవలెనో చూచినప్పుడే వారిని శిక్షింపవలయునను తలఁపు, అధికారమును కలుగును. తన కంటె భిన్నముగ ఇతరులను చూచువానికి వారిని శిక్షించుటకు అధి కారములేదు. అనఁగా వారిని తనసమానముగా గాని తానుగాగాని చూచుటవలన తనకీ యధికారము వచ్చినదన్నమాట. ఇట్లే రాజు కూడ తనప్రజలను పరిపాలింపవలయును. ప్రజల యోగక్షేమములే తనయోగక్షేమములుగా భావింపఁగలిగిన రాజునకే వారిని శిక్షించు అధికారము కలుగును. శ్రీ రాముఁడు రాక్షసులను శిక్షించెనను మాటకు కూడ ఇదియే యర్థము.

అధర్మమార్గమందున్న రాక్షసులను ధర్మమార్గమునకు మరలిం చుటకే రాముఁడు సంహారరూపమున శిక్షించెను. సంహారము కూడ శిక్ష యేనా? ఔను; సంహారముకూడ శిక్షయే. ఒక్కొక్కఁడు కొన్ని శిక్షలవలన ఇప్పుడే మంచి మార్గమునకు మరలును. కొందఱు తాము గావించిన మహాపాపములకు మరణ వ్యథారూపమైన శిక్షననుభవించి మరుసటి జన్మలో మంచిమార్గమునకు వత్తురు. రాముఁడు వాలిని సంహరించి నప్పుడే నిన్ను శిక్షించుచున్నాననియే చెప్పినాఁడు. వాలియు అంగీకరించినాఁడు. రావణుని సంహరించుట కూడ శిక్షయే. మరణ ముతో రావణత్వము పోయి శిక్షనొందిన జీవుఁడు మిగిలియే యున్నాఁడు. వానికి సద్గతులు కలిగించుటకు మత్తుమందిచ్చిన రోగికి శస్త్రచికిత్సవలె సంస్కార మొనర్చుట ధర్మము. కావుననే విభీష ణుని అన్నకు కర్మలు చేయవలసినదని బోధించినాఁడు. లేకున్నచో తానే చేయుదు నన్నాఁడు.

అనఁగా ఆ జీవుని యోగక్షేమములను తనవిగానే భావించినాఁడన్న మాట. ఈ సమత్వ బుద్ధివలననే ఆయనకు రావణుని శిక్షించు నధికారము కలిగినది. పరమేశ్వరుఁడు దుష్టులను శిక్షించునప్పుడు ఇట్లే గ్రహింప వలెను. శిష్టరక్షణము ఎట్టిదో దుష్టశిక్షణముకూడ నట్టిదే [There are virtues of Destruction as there are virtues of preservation] రోగికి శస్త్ర చికిత్సవలె [Operation దుష్టులకు సంహారమే యభ్యుదయ హేతువు. చక్రముచే సంహరింపఁబడి శిశుపాలుఁడు శ్రీ కృష్ణునిలో లీనమైనాఁడు. అరిషడ్వర్గములతో నైనను పరమేశ్వరునే భావించుచున్నచో దేహావసాన సమయమున మరణ వ్యథతో పాపములు నశించి పరమేశ్వరునితో నైక్యమే సంభవించును. కంసుఁడు హిరణ్యకశిపుఁడు మొదలగువారు ఇట్లే పరమేశ్వరుని యందు లీనమయినారు.

ఎప్పుడో పరమేశ్వరుఁడు శ్రీ రాముఁడుగనో శ్రీ కృష్ణుఁడుగనో అవతరించి దుష్టులను శిక్షించునని కనిపెట్టుకొని యుండ నక్కఱలేదు. ప్రతివాఁడును తన పరిధిలో తన బిడ్డలను, తమ్ములను, భార్యను, శిష్యులను ఎప్పటికప్పుడు శిక్షించుచు సన్మార్గమున పెట్టుచుండవలసి నదే. అంతకుముందు తన్నుకూడ తాను సంస్కరించుకొనుచుండ వలయును. శిక్షణమునకు సంస్కారమునకు కావలసిన ధర్మములన్నియు శాస్త్రములందు చెప్పఁబడియేయున్నవి. సామాన్యములని విశేషము లని ధర్మములు రెండు విధములు. పరదారధనాదుల నాశింపకుండుట మొదలగునవి సామాన్య ధర్మములు. వీనిని చక్కఁగా ననుష్ఠించిన వానికి విశేషధర్మముల ననుష్ఠించి ఆత్మగుణములను సంపాదించు కొనుటకు అవకాశమేర్పడును. నలువది విశేషధర్మములు, ఎనిమిది ఆత్మగుణములును చెప్పఁబడియున్నవి. వీనిలో సత్యపరత్వము ముఖ్యము. కోటి రామనామములు వ్రాయవచ్చునుగాని సత్యపరుఁడై యుండుట కష్టము. హనుమంతుఁడు లంకను చూచి వచ్చిన తరువాత, లంకలో ప్రతి యింటను అగ్నిహోత్రములున్నవి; కాని యా నగరవాసులలో సత్యదయాశౌచములు లేవని చెప్పినాఁడు. కాఁబట్టి సంస్కారములు

చక్కగా జరుగుచున్నచో దయాసత్యాదికములయిన యాత్మ గుణము లేర్పడవు. పదిమందియున్నచోట సత్యముండునని పూర్వ మనుకొనెడివారు. మరియిప్పుడు పదిమంది కలసినచోట ఎవరేమను కొందురో యను భయముతో తమకు తోఁచినది చెప్పక అసత్య ప్రసంగములలోనికి దిగుచున్నారు. "కలియుగములో అధర్మము ఎక్కువై ధర్మము తగ్గును. అధర్మమును ధర్మదృష్టితో చేయుదురు" అని పూర్వ గ్రంథములలో చెప్పఁబడియున్నది. అట్టి యాపత్తులలో కాలము విపరీతముగనున్నదని గ్రహింపవలెను సద్వర్తనమునకు విలువపోయినది పెద్దలేము, చిన్నలేదు. పెద్దలయెడ గౌరవము లేనే లేదు. చిన్నపిల్లవాడుకూడ సిగరెట్టు కాల్చుచున్నాఁడు. విద్యా రణ్యులవారి కాలముననే దేశము మ్లేచ్ఛాక్రాన్తమైనది. శ్రీకృష్ణుఁ డర్జునునకు భగవద్గీత నుపదేశించిన కాలము వేఱు. ఇప్పటికాలము వేఱు. భారతయుద్ధముజరిగిఐదు వేలయేండ్లకుపైఁగాగడచినది. ఇప్పటి స్థితినిగూర్చిఅప్పుడేవ్యాసభగవానుఁడు విష్ణుపురాణమున వర్ణించినాఁడు. పూర్వమునకు ఇప్పటికి భేదము చూడవలెనన్న ఈ క్రింది పద్యమును గమనింపుడు.

"కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన,
మాతృభావనచేసి మరలువాఁడు"

(ఆంధ్రభాగవతము-స్కంధ 7 పద్య 115) అని ప్రహ్లాదుని గూర్చిపోతన్నగారు వర్ణించినారు. ఆయన యేవిషయమును చూడఁ బోవుచుండఁగా, ఆయన కంటికి 'అన్యకాంతలు' అడ్డమైనారు? 'ఇందుఁగలఁ డందులేఁడను సందేహము లేక ప్రహ్లాదుఁడు ఎల్ల యెడల విష్ణుదేవునే చూచెడివాఁడు. అన్యకాంతలనఁగా తల్లి, సోదరి, భార్య తప్ప తక్కిన స్త్రీలు – అనఁగా పరస్త్రీలు కన్పించినంతనే ఆయన వారియందు మాతృభావన, దానివలన పరమాత్మ భావన చేసెడివాడన్నమాట. అన్యకాంతలు అడ్డమైనచో మనమిప్పుడు ఇట్లు భావించుచున్నామా? ఆత్మగుణములుగల భారతీయులు ఇప్పుడును ఇటులే భావింతురు.

పాశ్చాత్య మర్యాదలకు మనమర్యాదలకు భేదము చూడుడు. పరస్త్రీ కన్పించినంతనే తలవంచుకొనిపోవుట మన మర్యాద; ఎదురుగాపోయి సంభాషించుట వారి మర్యాద. మనము మన మనస్సులను శాస్త్రరీతిగా సంస్కరించుకొని ఆత్మగుణములను అలవరచుకొన్నచో మన మెన్ని పూర్వజన్మ వృత్తాంతములనైన ఎంత స్పష్టముగ తెలిసికొనగలమో నారదుని పూర్వవృత్తాంతము వలన తేటపడుచున్నది 'భాగవతము'లో ప్రథమ స్కంధమున ఈ వృత్తాంతము కలదు. నారదమహర్షి పూర్వకల్పములోని తన జన్మ వృత్తాంతమును, ఆ జన్మ ముగియునప్పటికి మృత్యువు సంగతియు వ్యాసభగవానునకు స్పష్టముగా చెప్పఁగలిగిన స్మృతిని కలిగియుండెను. మనముకూడ అట్టి సంస్కారమును సంపాదించుకొన్నచో, భూత భవిష్యద్వర్తమానములు సర్వమును తెలిసికొనఁగల మను విషయములో ఎట్టి సంశయము ను లేదు.

## 8. పాపపుణ్యములు

మంచి సంస్కారము కలుగుటకు స్వధర్మానుష్ఠానమేసాధనము. పాపభీతి, పుణ్యానురక్తి కలవాఁడే స్వధర్మము ననుష్ఠించును. మనము చేయుచున్నపనిని మనము చూచుట నేర్చుకొన్నచో పాపభీతి, పుణ్యమునందు అనురక్తియు తప్పక కలుగును. పుణ్యకార్యము చేయుచున్నప్పుడు సగర్వముగా దానినిగూర్చి భావించుచు చూచుచుందుము పాపము చేయుచున్నప్పుడు దాని స్వరూపమునుగూర్చి ఫలమునుగూర్చి భావించుటకు ఇష్టపడము. అనఁగా పాపమును చూడలేము. కాని అదికూడ మనలో పుట్టినయొక బుద్ధివృత్తియే గనుక అది మనకు కన్పింపకుండ పోదు; దానినసలుచూడకుండుటమనకునుసాధ్యము కాదు. అందువలననే కొందరు పాపముయొక్క వికృతస్వరూపమును చూచి భరింపలేక ఆత్మ హత్యకుకూడ పాల్పడుచున్నారు. అది ఆలోచనలేనిపని. ఈ జన్మలో

దానిని తప్పించుకొనుటకు ప్రయత్నించినచో పై జన్మలోకూడ అది తప్పక ప్రత్యక్షమగును. కావున పాపమును వదిలించుకొనుటకు ప్రాయశ్చిత్తమే మార్గము. ప్రాయశ్చిత్తములేని పాపములేదు. ఎంత పాపము చేసినను, నిజముగా పశ్చాత్తాపముకలిగినచో, ప్రాయశ్చిత్తము చేసికొని, పాపమును మాని పుణ్యకార్యముల నవలంబించి బాగుపడ వచ్చును. కాని సాధారణముగా పాపబుద్ధి పుట్టినచో అది వెంటనే మనలను పాపకార్యములోనికి దింపితీరును. పుణ్య బుద్ధిపుట్టినచో ఆ పని తరువాత చేయవచ్చునులే అని జాగుచేయుదుము. ధర్మకార్యమును చేయునపుడు, అదే నేననుకొని, దానితో తాదాత్మ్యమును పొంది (identification) ఆనందింతుము. పాపము చేసినపుడు, ఆ పని చేయనట్లు, అసలు దానితో సంబంధమే లేనట్లు సంచరింతుము.

భగవంతుని విషయమునకూడా స్వార్థమును పాటించినంతగా భక్తి నవలంబింపము "కలౌ వేంకట నాయకః" అని యిప్పుడు వేంకటేశ్వరుడు మన కందరకును ఇలవేల్పుగానున్నాడు రోగమో ఆపదో వచ్చినప్పుడు ఆ దేవునకు మ్రొక్కుకొందుము. అప్పటివరకును ఆయన స్మరణయే యుండదు. రోగము కుదిరిననే ఆ మ్రొక్కునయిన చెల్లింతుము; లేకున్నచో చెల్లింపము కుదిరిన తరువాతకూడ మ్రొక్కు చెల్లింపకున్నచో, మన మసలును వడ్డీతోకూడ చెల్లింపవలసివచ్చునన్న భయముతో చెల్లింతుము. ఇదికూడ ఒకవిధమైన భక్తియే. కాదనుటకు వీలులేదు. ఆర్తుడుకూడ భక్తుడు కావచ్చును, ఆపద కలిగినప్పుడు ఎవరినో యొకరిని ఆశ్రయించుటకన్న భగవంతునాశ్రయించుటమేలే. అట్లు అనేక పర్యాయములు మ్రొక్కుబడులు చెల్లించిన తరువాత ఆ దేవునియందు అవ్యాజమైన భక్తి క్రమముగా కలుగవచ్చును.



:- ప్రథమ భాగము సమాప్తము -